
లోకం పోకడ
రచయిత
కొర్రపాటి గంగాధరరావు

# లోకం పోకడ

(సాంఘిక నాటకము)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# లోకం పోకడ

విఖ్యాతవంతుడైన యువకుడు వుద్యోగంలోనో యితర వ్యావృత్తిలోనో కొత్తగా ప్రవేశించిన రోజుల్లోనూ ప్రవేశించబొయ్యే ముందురోజుల్లోనూ, తన జీవితాదర్శాలను గురించి ఎన్నెన్నో కలలు కంటాడు. జీవితాన్ని ఆదర్శమార్గాల్లో నడుపుకోవాలనీ, మహాపురుషుల అడుగుజాడల్లో నడుచుకోవాలని ఆశిస్తాడు. కాని తనచుట్టూ వున్న వాతావరణం అవలోకించి, తన ఆదర్శాలకు తావు దొరకదని నిమ్మదిగా గ్రహిస్తాడు.

పరిస్థితులు మించి వచ్చిన సందర్భాలలో తనూ నీచంగా మారిపోతాడు గూడా.

దీనికి కారణం ఏదైనా జరుగుతున్న చరిత్ర యిది.

ఆనందం అల్లా మారిపోకుండా వుండాలని పోరాడాడు.

దొంగకుర్రాడు రత్నం, రంగయ్య మొదలైనవారు మారిపోయారు. తిరిగి సంస్కరింపబడ్డారు.

ఆనందంవల్ల కళావతి మారిపోకుండా నిలవగలిగింది. తక్కిన పాత్రలన్నీ లోకంపోకడ చూపిస్తవి.

కొంచెం ఖర్చు భరించగల సంఘాలకు ఇదొక చక్కని నాటకం. వెనక నల్లతెర, ప్రక్కగది Set (Booking Office) తక్కిన రంగమంతా కటకటాలు వీటితో రంగాలంకరణ సులభ సాధ్యం.

నటుల సంఖ్య గూడా మామూలుగా నేను రచించిన నాటకాలకంటె కొంచెం ఎక్కువ.

గంగాధరం.

## పాత్రలు

ఆనందం—కొత్తగా వుద్యోగంలో చేరిన యువకుడు. ఆదర్శజీవితాన్ని నమ్మినవాడు. ప్రపంచంలో అనుభవం తక్కువ. వయస్సు 25 సం॥

గోపాలం—రిటైరయిన A. S. M. ప్రపంచంలో అనుభవించి తల నెరిసిన వాడు. వయస్సు 55 సం॥లు.

ముకుందం—గ్రామంలో ఒక రాజకీయవేత్త. తెలివిగలవాడు. (35 సం॥)

శ్రీధరం—గ్రామంలో పంచాయతీబోర్డు రాజకీయవేత్త. ధనికుడు. తెలివిగల వాడు కాదు.

వెంకటేశ్వర్లు—గ్రామంలో సామాన్య పౌరుడు. ధనవంతుడు (45 సం॥)

మోహన్—వెంకటేశ్వర్లు కొడుకు. చదువుకుంటున్న యువకుడు. (22 సం॥)

కవి—ఆదర్శలోకాల్లో కవి ననుకుని విహరిస్తూ విహరించలేక బాధపడ్తున్న యువకుడు.

దొంగ—(రత్నం) దొంగతనం అలవాటై చెడిపోయిన కుర్రవాడు. (18 సం॥)

బిచ్చగాడు—దొంగకుర్రాడి తండ్రి.

రంగయ్య—స్టేషన్‌లో పనిచేసేవాడు. (30 సం॥)

ఆఫీసర్—ఎంక్వైరీ చేయడానికి వచ్చిన పెద్ద వుద్యోగి.

కళ—18 సంవత్సరముల యువతి.



# లోకం పోకడ

## మొదటి రంగము

ఒక పల్లెటూరు స్టేషను వసారా—ఒకవైపున స్టేషన్ బుకింగు గది. దానికి ద్వారం – రెండవవైపున కటకటాలు, గేటు కనిపిస్తాయి. రెండు, మూడు జాజి చెక్క పెట్టెలు, వసారాలో వున్నాయి. కటకటాల వెనక బుకింగు కిటికీ దగ్గర ఒక లాంతరు స్తంభం. బుకింగు ఆఫీసు ద్వారం దగ్గర వకలాంతరు స్తంభం వున్నాయి.

[మధ్యాహ్నం 3½ గం॥ వేళ. ఆ సమయానికి బండి యేదీ లేకపోవటంవల్ల ప్లాటుఫారంమీద జనం ఎవరూ లేరు. స్టేషన్ డ్యూటీలో ఉన్న A. S. M. ఆనందం, కొన్నాళ్ళ క్రింద అతనికి చార్జీ వప్పజెప్పిన రిటైర్డు A. S. M. గోపాలం, వసారాలో కూర్చొని మాట్లాడుతున్నారు.]

గోపా—ఊఁ కాబట్టి; నువ్వు మా శేషగిరి కొడుకువన్న మాట.

ఆనం—అవును.

గోపా—B. A. Pass అవంగానే A. S. M. కోర్సు ట్రైనింగుకు పంపాడు మీనాయన.

ఆనం—మరే.

గోపా—ఈ సంవత్సర మంతా రిలీవింగ్ A. S. M. గా పనిచేశావ్.

ఆనం—అవును.

గోపా—తర్వాత మొదటి సారిగా, ఇక్కడ పర్మనెంటు A. S. M. గా పోస్టు చేశారు.

ఆనం—అవును.

గోపా—ఇక Shift ప్రకారం ఇక్కడ వచ్చే రైలుకి, పోయే రైలుకి జండా వూపుతూ, గంట కొడుతూ జీవితమంతా యీడుస్తావు.

ఆనం—(నవ్వి) అవును.

గోపా—అవును. బండికి కట్టిన కోడె దూడలాగ

ఆనం—ఆ.

గోపా—కోడె దూడకి బండి బరువెంతో తెల్సుకోకుండా బండిలాగటమే పని.

ఆనం—నాకు తెల్సు - స్టేషన్ మాష్టర్ ఉద్యోగం చాలా బాధ్యత కలది.

గోపా—కాని యీ పల్లెటూరు స్టేషన్ మాష్టర్ బరువు ఇంకా బాగా తెల్సి వుండదు.

ఆనం—ఏం...? పల్లెటూరిలో నేనూ పనిజేశాను.

గోపా—ఒక్క సంవత్సరం రిలీవింగ్ A. S. M. గా చెయ్యగా స్టేషన్ మాష్టరుపని తెల్సిందేమోలే! కాని ఇంత కంటే పెద్ద బాధ్యతల సంగతి తెలియదుగా.

ఆన—అదేమిటి ?

గోపా—జీవితం...జీవితం బరువు.

ఆన—జీవితంలో బాధ్యతను బరువంటారా ?

గోపా—ఆ, చాలా పెద్ద బరువు.

ఆన—ఏమో నాకలా అనిపించదు.

గోపా—అనిపించదు. అప్పుడే అనిపించదు. నాలాగనెత్తి మీద జుట్టు నెరిస్తే...బ్రతుకు భారంలో నడుం వంగితే. అప్పు డనిపిస్తుంది. ఏమో! నాకు 55 యేళ్ళు. నాకిప్పు డనిపిస్తుందదే...జీవితం జీవించ తగ్గది కాదు.

ఆన—నిరాశవాదం. ముసలితనంలో, నిరాశావాదం నేర్చు కుంటారా, అదే వస్తుందా ?

గోపా—ఏమో! కాని, ఇది నా అనుభవం, పడుచుతనంలో, నే నేమనుకునే వాణ్నో జ్ఞాపకంలేదు. ఈ భావం, నాలో ఎప్పట్నుంచీ వుందో, జ్ఞాపకం లేదు. కాని బ్రతుకు బరువు...తలకు మించింది. నిరాశ కాక ఏముందంటావ్‌— ఈ ప్రపంచంలో. ఉంగరాల చేత్తో మొట్టికాయలేసే పై యజమాని, కష్టాల్లో కలిసిరాని సాలివాడూ... బాధ్యత నెత్తిన రుద్ది తప్పించుకుపోయే బంధుమిత్రులూ, నేను 30 ఏళ్ళ సర్వీసుచేసి ఫించను పుచ్చుకున్నప్పు డివ్వే జ్ఞాపకం తెచ్చుకో గలిగాను. నీకు తెలియదయ్యా... కుర్రాడివి. ఈ జీవితరథానికే ఎద్దువీ, చక్రానివీ నువ్వే.

ఆనం—నా బండి నా భుజంతో లాగుతూ, రెండో భుజంతో రెండవవాడికి సాయం చెయ్యగల్గితే, నా జన్మ తరించిం దనే తలుస్తాను.

గోపా—తరించిందనే తెలుస్తావ్. అప్పుడు మూడవవాడికి మూడవభుజం ఇవ్వాల్సివస్తుంది. ప్రపంచంలో అందరూ మనలాటివాళ్ళే వుండరు. వున్నవాళ్ళందరూ గోజాపువ్వుల్లాంటి వాళ్ళు కాదు. ముళ్ళలాంటివాళ్ళు. ముళ్ళింకా గుచ్చుకోలేదు. కనక ఆ సంగతి నీ కింకా తెలియదు. ముందు జీవితం అంతా మధురమైన కలలాగుంది...నీకు. కాని జీవితం కలకాదుగా.

ఆనం—ఏమో! నేను కలలే కంటున్నానేమో. కాని నిరాశపడి వూరుకునేకంటే...నా జీవితాన్ని "కలే" చేసుకుంటాను.

గోపా—ఆఁ...ఆ. ఏం చేస్తావో నేనూ చూస్తూనేవుంటాలే. ఈ వూళ్ళోనే వుంటాగా! ఆ కాలవ ప్రక్క యిల్లు కుదిరింది. వస్తూపోతూ వుంటానులే.

[వెంకటేశ్వర్లు అనే పెద్దమనిషి వస్తాడు-వయస్సు 45 సంవత్సరాలు]

వెంక—మాష్టరుగారూ...మాష్టరుగారూ...

గోపా—ఇకనుంచి నేను కాదండి. స్టేషన్ మాష్టరు ఆయన. నేను రిటైరు అయ్యాను.

వెంక—అలాగాండి. సరే - కాని, ఈ 4 గం॥ బండి ఎప్పుడొస్తుందండీ.

గోపా—ఆయన గార్నడగండి.

వెంక—ఆయన కొత్తవారండీ. ఆయనకేం తెలుస్తుంది? మీరు చెప్పండి.

ఆనం—(నవ్వి) 4 గం॥ల బండీ - 4 గం॥ కే వస్తుంది.

వెంక—చూశారా, చూశారా. 4 గం॥ బండి 4 గం॥ కెప్పు డన్నా వచ్చిందా? అసలే అది నాలుగు గంటలబండి.

ఆనం—ఆగండి. కంట్రోల్లో కనుక్కు చెపుతా (అని బుకింగు లోకి వెళ్తాడు)

వెంక—కొంచెం గట్టిగా కనుక్కోండి బాబూ. దాన్లో బాగా వినపడదు.

గోపా—ఏం? తొందర పడ్తున్నట్లున్నారు!

వెంక—తొందరేనండి. తొందరసమయాల్లోకూడా బండి తొందరగారాదు.

గోపా—ఎవరన్నా వస్తారా యీబండికి.

వెంక—లేదండీ. నేనే వెళ్ళాలి తొందరగా.

గోపా—ఏం?

వెంక—ఏం చెప్పమంటారు? మావాడెవత్తెనో పెళ్ళిచేసు కుంటాట్ట. (ఆనందం వస్తాడు) పట్నంలో చదువుకుంటు న్నాడులెండి. ఏంచెప్పమంటారు, నా అవస్థ? ఇక్కడ పదివేల కట్నంతో సంబంధం ఒప్పుకున్నాను. (ఆనందంతో ఏంచెప్పారు బాబూ?

ఆనం—4 గం॥ బండి—4 గం॥లు లేటు.

వెంక—చూశారా, చూశారా. నేనవతల Mail కి వెళ్ళవలసి వుంటే!

ఆనం—మీరు తొందరగా వెళ్ళాలని, బండి తొందరగా వస్తుందా?

గోపా—పోనీ టిక్కెట్టు తొంవరగా పుచ్చుకోండి.

ఆనం—ఏవూరు వెళ్ళాలేమిటి?

వెంక—పట్నం.

గోపా—వాళ్ళ అబ్బాయిపెళ్ళికి.

వెంక—పెళ్ళి! దొరికినదాన్నల్లా, చేసుకోవటమే ఈరోజుల్లో.

గోపా—మీరే అన్నారుగా – చేసుకుంటున్నాడని.

వెంక—చేసుకుంటానని రాశాడు. రాస్తే యేం? ఇంకా చేసుకోలేదుగా.

గోపా—మరి మాటిచ్చిన తర్వాత – మీరు వద్దంటే మానేస్తాడా?

వెంక—ఆ, మాటిస్తాడు. నేనూ యిచ్చాను. యిక్కడ 10 వేలకి మాట. మాటలతో పెళ్లిళ్ళవుతాయా!

[ఒకయువకుడు వస్తాడు. చూడడానికి వేరే లోకంలో విహరించటం అలవాటైన కవిలాగుంటాడు. ఎక్కడో చూస్తూ మాట్లాడుతాడు. మాటల్లో తనెక్కడున్నాడో కూడా మర్చిపోతుంటాడు. ఈలోకానికి మించినవాడ నని ఈమనుష్యులకే అతీతమైనవాడననీ ఉద్దేశ్యం.]

కవి—బండి ఎంతలేటండీ – ఇవ్వాళ?

ఆనం—4 గంటలు.

కవి—బాగుంది. దివ్యంగా వుంది. 8 గం॥ లకి గాని బండి రాదు. బాగుంది.

వెంక—బాగుందేమిటండీ – బండిలేటంటూంటే?

కవి—అవును. ఈలోపున సూర్యాస్తమయం చూచిరా వచ్చు, ఆరుగంటలకి ఆకుపచ్చని చేలమీదుగా, కొండ చాటుకు ముచ్చటగా సూర్యుడు కృంగిపోతూ - అరుణా రుణ కాంతుల్తో ఆకాశాన్నీ సస్యశ్యామలాల చెక్కిళ్ళ నుంచి చిత్రిస్తుంటే హృదయం పొంగిపోతుంది.

వెంక—చూశారా, చూశారా. కవిత్వం కాబోలు - ఖాళీగా కూర్చోలేక మే మేదుస్తుంటే!

కవి—అల్లా అంటారేమిటండీ! ఎదురుగా లేత ఎండలో తళ్ళళలాడుతూ చిరుగాలిలో, వుయ్యాలూగే జొన్న కన్నె కులుకులు.....

వెంక—ఏడిసినట్టున్నాయి. వూరికే తిండి తిని పడివుండలేక, ఇవతలవాడి ఇల్లు తగలడుతూంటే - కవిత్వం రాశే రకం లాగుంది.

కవి—ఇప్పు డెవరి ఇల్లు తగలడింది?

వెంక—మాదే. మావా డెవత్తెనో పెండ్లి చేసుకుంటాట్ట.

కవి—(వినిపించుకోకుండా) నిజంగా ఇళ్ళు తగలడుతుంటే ఎంత చిత్రంగా ఉంటుంది! ఆ చిటపటలు! ఆ ధగ ధగలూ! ఆ ఫెళ ఫెళలూ! వీతిహోత్రుడు తన కెంజాయ ఉత్తరీయాలు గాలికి విసరి వేసినట్లు! చేతకాని చిత్ర కారుడు వేయి ఎర్రని కుంచెలతో ఒక్కసారిగా పరి సరాలను పులిమి వేసినట్లు - ధరణీమాత క్షుద్బాధ సహించ లేక, ఎర్రని నాలుకలు సాచి ఆడించినట్లు! ఇల్లు మీద

యితేమాత్రం, ఆ అద్భుత దృశ్యం మళ్ళీ ఎప్పుడు లభిస్తుంది – ఒక్కసారి వెయ్యి పెళ్ళిళ్ళ సంరంభం.

వెంక—ఏమయ్యోవ్! మాటలు సరిగారానీ. ఇల్లు సంగతలా వుంచి వళ్ళు తెలిసి వస్తుంది.

కవి—ఛీ, ఛీ అందుకనే కవుల కీ ప్రపంచంలో స్థానంలేదు. కవులకి స్థానం – ఆ తెరుఛాయలూ, కొండ లోయలూ, అంతే (వెళ్ళబోయి ఆగి) బండి 8 గం॥ దాకా రాదుగా. (జవాబు వినకుండా వెళ్ళిపోతాడు)

గోపా—కవిగారు కేవలం ప్రపంచాన్ని మర్చిపోలేదు.

వెంక—ఎట్లాగెండి మర్చిపోవటం?

ఆనం—ఏం, మీరు మర్చిపోలేదూ?

వెంక—ఏమిటీ?

ఆనం—మీ అబ్బాయి ఎవర్నో పెళ్ళాడబోతున్నాడు గాదూ?

వెంక—అవును.

ఆనం—అంటే... ఆ అమ్మాయికి మాటిచ్చాడుగా?

వెంక—మాటి స్తే?

ఆనం—దాన్ని మీరు కాదని అతని మనసు విరచి లాక్కొద్దామనేగా బయలుదేరారు?

వెంక—అదేమిటండీ! మా అబ్బాయిని మా అదుపులో ఉంచుకోవటం తప్పా!

ఆనం—అది తప్పుకాదు. ఆ అమ్మాయి బ్రతుకు అధోగతి పాలుచేయుటం తప్పు.

వెంక—చూశారా, చూశారా ఆ అమ్మాయే మావాణ్ణి పాడు చేసిందని మే మేడుస్తుంటే.

[గబగబా రంగయ్య పరుగెత్తుకు వస్తాడు రంగయ్య స్టేషన్‌లో సర్వెంటు. ఆనందం యీడువాడు. కాకి నిక్కరు, చొక్కా వేసుకున్నాడు]

గోపా— ఏమిటది !

ఆనం—ఏమిటది రంగయ్యా !

రంగ—ఏం లేదు బాబూ. (ఆగి అంటాడు. ఆయాసం వస్తున్నాడు)

గోపా—వీరయ్య వెంట పడ్డాడా ?

రంగ—(సిగ్గుపడి) అవునయ్యా !

గోపా—ఊఁ, ఫో. ఇంకేం బుకింగ్‌లో దాక్కో.

ఆనం—ఏమిటండీ అది !

గోపా—అది మామూలేలే. వీరయ్య Signal Man ని ఎరగవ్! వాడింటికి వీడెళ్తే, వెంటపడ్డాడు.

ఆనం—ఏం ?

గోపా—అదో గాథ !

ఆనం—ఎవరు వెళ్ళినా వెంటబడ్తాడా !

గోపా—అబ్బే. అందరి వెంట యెందుకు పడ్తాడు! ఒక్క రంగయ్య వెంటే.

ఆనం—అదేం ?

గోపా—అంతా వ్రంపె లే.

ఆనం——తెలిసి వీడు వాడింటికి యెందుకు వెళ్తాడు!

[ముకుందం ప్రవేశిస్తాడు. వయస్సు 35 సం॥లు సిల్కు లాల్చీ, గ్లాస్కో–పంచ, ఫాషన్ బుల్ గా వుంటాడు. మంచి కలుపుగోలుతనంగా మాట్లాడుతాడు.]

ముకు——నమస్కారమండీ మాష్టరుగారు కొత్తమాష్టారి కూడా బండి 4 గం॥లు లేటటగా.

ఆనం——అప్పుడే అందరికి తెల్సిందే, లేటు సంగతి.

గోపా——వారికి మనకంటే ముందే తెలుస్తాయి – అన్ని సంగతులు.

ముకు——(నవ్వి) మీరింకా ఇక్కడే ఉన్నారేం? రిటైరు అయ్యారుగా!

గోపా——మరి, అలవాటైపోయింది. స్టేషనుకు రాకపోతే ఏమిటో ఇదిగా ఉంటుంది.

ముకు——ఇంకా స్టేషనె ఎందుకండి? ఇంటికెళ్ళి కాలిమీద కాలేసుకు కూర్చోక...

గోపా——హుఁ? కాని, ఈ జీవితానికి అంత అదృష్టం పట్టలే!

ముకు——అదేమిటండీ! ముప్పయేళ్ళ సర్వీసు. ఏడాదికి వెయ్యి రూపాయలు వెనకేసినా ముప్పైవేలవుతాయి.

గోపా——వెనక వెయ్యటం అంత సులభమా?

ముకు——మీరు తల్చుకుంటే సులభం కాకేమిటి! ఒక్క పేగన్లమీద నెలకి వెయ్యి వస్తుంది.

గోపా——కానీ తల్చుకునీ మిగుల్చుకోలేకపోయూ శ్రీ నిష్ట దరిద్రుడు.

ముకు—అలా అని కొత్తకుర్రాళ్ళనుకూడా పాడుచేయకండి. మీ పద్ధతులే నేర్పి... బ్రతికి బట్ట కట్టవలసినవాళ్ళు-

గోపా—(నవ్వి) చూశావుటయ్యా ఏమంటున్నాడో! మేం మిమ్మల్ని చెడగొట్టుతామట!

ఆనం—ఏమైనా ఇది Public Platform. నీచాన్ని మరుగ్గానే వుంచి, మంచి మాట్లాడటం మంచిది.

ముకు—అప్పుడే మడి గట్టుకున్నట్టున్నారే మీరు! ఇవన్నీ తర్వాత ఆలోచిద్దాం లెండి తీరుబడిగా! మావాళ్లొచ్చారు, స్టేషన్ కి మాట్లాడొస్తా.

(రెండోవైపు Platform మీదికి పోతాడు)

ఆనం—ఎవరండీ... ఈయన?

గోపా—ఊళ్ళో పెద్దమనిషి!

వెంక—ఆ. ఆ. పెద్దమనుషులే, అందరూ! భస్మాసురుడు! మావాడే లెండి. వాడి సంగతి అంతా నాకు తెలుసు.

గోపా—ఏదైనా పలుకుబడి గలవాడు. ఆయనతో కజ్జా పెట్టుకోవటం మనకి మంచిది కాదు. సమయానికి అవసరమయ్యే పలుకుబడి అన్ని ఆఫీసుల్లోనూ వుంది.

ఆనం—మనం మంచిగా వుంటే ఒకరితో అవసరం మనకేమిటి!

గోపా—అదే వచ్చింది మీ కుర్రాళ్ళతో! నువ్వింకా కుర్రాడివయ్యా! నీకు తెలియదు. ఈ Platform మీదలాగే, ఈజీవితంలోనూ, ప్రతి క్షణం మనం అనేకమంది

నెదుర్కొంటాం. ఒకడి మంచితనంవల్ల - మనం ఎలా బాగుపడతామో! ఒక్కడి చెడ్డతనంవల్లా అల్లాగే బాగు పడవచ్చు.

ఆనం—చెడ్డతనం వల్ల వచ్చేలాభంకంటే నష్టమే ఎక్కువ.

గోపా—అబ్బాయ్! ఎందుకొచ్చిన పెరనాదనలివ్వీ - బ్రతక టానికి పనికిరానివి. నువ్వొవినే వుంటావ్. భూమిమీద పడ్డప్పట్నుంచీ! బ్రతకటానికి కొక పోరాటం, ప్రారంభ మవుతుంది. "బ్రతుకు ఒక పోట్లాట" పోట్లాటి గెల్చిన వాడే బ్రతకటాని కర్హుడు. బ్రతకటంలో న్యాయాన్యా యాల విచారణ అక్కర్లేదు. బ్రతకటం సహజం. న్యాయాన్యాయాల విచారణ అసహజం.

వెంక—బాగా చెప్పారు!

ఆనం—అప్పుడు మనిషీ జంతువూ నొకటే!

గోపా—అవును. మనిషి జంతువుగా ఉండటమే సహజం. దేవత అవటం అసహజం.

ఆనం—నిజమే నేమో! సాధించి మానవుడు దేవత అవటం అసహజమే కావచ్చు. వాని అదే ఆదర్శం - అదే ఆనం దంకూడా.

వెంక—పని ఆనందమో తెలియదు; కాని రైలు పాక ఇల్లా కూర్చోటం మాత్రం మహాకష్టం బాబూ.

ఆనం—ఏ కష్టాల్లోనైనా ఆనందించటం నేర్చుకోవాలి మనం (రంగయ్య బైటకు వస్తాడు)

గోపా—కష్టాల్లో ఆనుదించ గల్గిన వాణ్ణే నేనొక్కణ్ణే చూశాను.

వెంక—ఎవరది ?

గోపా—మా రంగయ్యలెండి. ఏరయ్యా కొట్టబోయినా అక్కడికే వెళ్తాడు. రైలు ఆలస్యంగావస్తే మరీ ఆనం దిస్తాడు. మనోసారి అటెళ్ళి రావచ్చుగదాఅని.

రంగ—(నవ్వి) బండీ లేటే బాబూ! ఈ లోపున మొక్క లికి నీళ్ళోసి వస్తాను.

ఆనం—ఆ. ఫో! (రంగయ్య వెళ్ళిపోతాడు)

[ఈలోపున ఒక బిచ్చగాడు వస్తాడు కుంటుతూ, అడు క్కుంటూ, వెంకటేశ్వర్లుతో]

బిచ్చ—బాబూ...అయ్యా...చెట్టంత కొడుకు కడుపులో చిచ్చుపెట్టి పోయాడయ్యా - చాకిరీ చేసుకు బ్రతికినోణ్ణి బుజం చచ్చుబడిపో నాయినా! కనికరించండి. బాబూ బా.

వెంక—ఫో - ఫో - ఇదే పని నీకు. అసలే రైలురాక పేం యేడుస్తుంటే !

బిచ్చ—నాయేడుపుకుండా వినండయ్యా.

[ఒక ఇరవై ఏళ్ళ కుర్రావాడొస్తాడు నిక్కరు-చొక్కాతో]

కుర్ర—సార్ - సార్. ఒక్క మాట - ఇలా వస్తారా.

వెంక—ఏం. ఎందుకూ?(అంటూ లేచి వాడివెంట వెళ్తాంటే శ్రీధరం ఎదురువస్తాడు. నలభై ఏళ్ళుంటాయి. మంచి శ్రేయుంతుడుగా కనిపిస్తాడు. తెలివితక్కువతనం మొహంలో

కనిపిస్తుంటుంది. శరీరంకూడా ముఖందంతో స్థూల కాయం.)

శ్రీధ—(వస్తూనే) వెధవవ్వూరు - వెధవవ్వూరా! ఊళ్లో ప్రతివాడూ రోజూ స్టేషనికి రావుదే గడవదు. ఆ దారిలో కాలవకి, వంతెన కట్టించాలని ఒక్కడికి తట్టదు.

గోపా—మీకెప్పుడు తట్టిందీ?

శ్రీధ—ఇదిగో (కాలుచూపించి) వస్తూంటే కాలికి దెబ్బ తగిలింది. అడ్డమయినవాడు పంచాయితీబోర్డు ప్రెసిడెంటవంగానే సరా! ఊరి అవసరాలు తెలియని ప్రెసిడెంటు ఎందుకండి -- అడుక్కుతినను.

ఆనం—ఏం అడుక్కుతిననూ?

గోపా—ఓట్లులే!

శ్రీధ—బాగా అన్నారు. చూడండి - ఈప్రజానీకానికేం నాశ బుద్ధివుంది! ఓట్లువేస్తే - వంతెన వేయిస్తామని, పేపర్లు అచ్చువేయించి పంచిపెట్టారు, మాపార్టీవాళ్ళు. అచ్చు పేపర్లు పంచిపెట్టినా ఓట్లు పెట్టెలో వేయరే!

గోపా—నోటిమాటలమీద - అచ్చుపేపర్లమీద నమ్మకాలు పోయాయి ప్రజానీకానికి.

శ్రీధ—నేను ప్రెసిడెంటునయితే ఈపాటికి 10 వంతెనలు లాగేశావాణ్ణి. వంతెనంటే ఏముందండీ! పదిమంది 10 రాళ్లు పడేసి. దానిమీద అడ్డగర్రలు పడేశే. మట్టి గప్పటమేగా!

గోపా—అంతే మరి!

శ్రీధ—చూశారా-తలకాయ లేదండీ - ఒక్కడికీ తలకాయ లేదు. దేశంలో పెద్దతలకాయలకే తలకాయలేదు. చిన్నవారు సంగతులెందుకు? మానాన్న బ్రతికుండగా వూళ్ళో వెయ్యివోట్లుండేవి. వెయ్యివోట్లు మనవాళ్ళేగనక - మా నాన్న 20 ఏళ్ళు ప్రెసిడెంటు చేశాడు. తీరా, నేనొచ్చేసరికి, తలకాయ లేకుండానే నెహ్రూ తలకొక వోటు యిచ్చాడు. 'ఆ యివ్వటం' వక్కడికి - నాకు వోటిచ్చే వాడికిచ్చాడూ?

ఆనం—ఓట్ల సంగతి యిప్పుడెందుకండీ! మనకు కావల్సింది వంతెన. అవునా కాదా?

శ్రీధ—అవును.

ఆనం—వంతెన కట్టటానికి ఎంత అవుతుందీ?

శ్రీధ—ఎంతండీ! మహాయితే, 3 వేలు. వెధవపంటకాలవండీ - అంతా రెండుగజాలు లేదు.

ఆనం—ఆ 3 వేలల్లో నేను-నాజీతంలోంచి, 100 రూ॥ యిస్తాను. మీరెంత యిస్తారో చెప్పండి?

[వెంకటేశ్వర్లు ఒక వైపునుంచి, ముకుందం, మరోవైపు నుంచి వక్కసారిగా వస్తారు.]

ఆనం—నలుగురం నాలుగువందలు. చందావేస్తే, వంతెన తయారవుతుంది.

ముకుం—చందాలంటున్నారేమిటి. చందాలయితే నాతో చెప్పండి.

ఆనం—ఆ. చందాలే. మనం ఊళ్ళోంచి స్టేషన్‌కి రావటానికి, పంటకాలవకి వంతెన చాలా అవసరం.

గోపా—అవసరమే-అందరికీ. - కానీ, నీకుమాత్రం అనవసరం.

ఆనం—ఏం?

గోపా—మనకీ, ఈ వూరికి ఏం సంబంధముయ్యా - స్టేషన్లోనే ఉండేవాడికి రోజూ ఊళ్ళోకి వెళ్ళందే గడవదా మనకి? అందులో యివ్వాళ ఉండి. రేపు Transfer అయ్యే వాళ్ళం.

ఆనం—కానియ్యండి. ఈ ఊరికి ఉపకారమైన పని చేస్తే తప్పు లేదుగా.

ముకు—అందుకని...వంతెనకు చందా వేయిస్తున్నావేమిటి?

గోపా—ఆ. ఆయన చందా వందరూపాయలు వేశేశాడు ముందుగానే.

ముకు—అబ్బే బ్బే. చందాపట్టీలో మన పేరు ముందెట్టుకో కూడదు. ఇచ్చినా - ఇవ్వకపోయినా - ఊళ్ళో పెద్ద తలకాయ పేరు ముందుండాలి. నోటీసు వ్రాసి కాగితం నాకివ్వండి. వె నోట్లల్లో నే వే వేయిస్తాను.

వెంక—అ...అయినట్టే...వద్దులెండి పనులు కావాలంటే అలావద్దు.

ఆనం—ఏమండీ, మీరు మాట్లాడకుండా ఊరుకున్నారు;

శ్రీధ—నేను వెయ్యను...చస్తే యియ్యను.

వెంక—ముకుందంగారు వేస్తే - వారు వెయ్యరులెండి.

ఆనం—ఏం !

గోపా—వాళ్ళ యిద్దరికి పార్టీ లే.

ముకు—ఆయన వెయ్యకపోతే ఉండిపోదులెండి. నోటీసు వ్రాయించండి.

శ్రీధ—వుండి పోదేం ! ఎట్లా వూడి పడుతుందో నేనూ చూస్తాగా !

ముకు—ఎట్లా వూడిపడదో నేనూ చూస్తా.

శ్రీధ—ఆ...ఆ. వూడిపడుతుంది. ప్రెసిడెంటు చేతిలో ఉండగానే పొడుచుకు వచ్చాయి. ఖో -ఖోవయ్యా ! మా నాన్న 20 ఏళ్లు చేశాడు - బోడి ప్రెసిడెంటుగిరీ !

ముకు—ఆ ప్రెసిడెంటు కోసమేగా 20 వేలు ఖర్చాయి తల బోడయింది.

ఆనం—ప్రెసిడెంటుగిరీ కోసం 20 వేలు ఖర్చు చేశారా ?

వెంక—ఆ. దాదాపు అయిందిలెండి.

ఆనం—అయితే మీరు వెయ్యి రూపాయలన్నా వెయ్యా లండి.

శ్రీధ—వెయ్యను - ఒక్క దమ్మిడీకూడా వెయ్యను.

ముకు—వెయ్యరు. వెయ్యటానికి జేబులో వుంటేగా ! జేబులో డబ్బులేదు...అమ్మటానికి పొలాలు లేవు.

శ్రీధ—లేవు - లేవు ! ఉన్నాయో, లేవో - వకసారి ప్రెసి డెంటు నయితే - అప్పుడు తెలుస్తుది. ఈ సారి ప్రెసి

3

డెంటునై, ఎంతైనా సరే - వంతెన కట్టించి, ఈ మీసం గొరిగిస్తా. కాసుకో...

ముకు—అందాకా కూర్చోదులే. వంతెన 3 రోజుల్లో ముగిస్తా నేను.

శ్రీధ—3 రోజుల్లో వేయిస్తావేం ? 3 రోజుల్లో పీకి పారేయిస్తా చూడు.

ముకు—ఏమిటి ? నువ్వు పీకి పారేయించేది ?

శ్రీధ—నిన్నూ, నీ వంతెననీ, నీ ప్రెసిడెంటునీ కూడా. ఊరికినే కూర్చున్నా ననుకున్నావేం?

ఆనం—ఆగండాగండి. కాస్త వంతెన ఊరివారందరికి కావల్సింది. ఒకరు కట్టించి మరి ఒకరు పీకిపారెయించటం ఎందుకూ ?

శ్రీధ—ఆగండీ! మీకేం తెల్సు? వట్టి దద్దమ్మ ననుకున్నాడేమో! నువ్వే వంతెన వేయించూ, ఈ వూళ్ళో నేను ఉండను.

ముకు—అయితే సరే. వంతెన పడేదాకా నేను ఊళ్ళోనే ఉంటాను.

శ్రీధ—నువ్వుంటేనే వంతెన పడ్తుందేం ?

ముకు—నువ్వు లేకపోతే తప్పకుండా పడ్తుంది.

శ్రీధ—చూసుకో - నువ్వుండగా పడ్తుందో - నే నుండగా పడ్తుందో! నేను ప్రెసిడెంటు నవాలి...వంతెన...

ముకు—ఆ! పడాలి. ఊడి పడ్తుంది. ఉన్న వంతెన.

ఆనం—ఏమిటి - ఆగండీ. కాగితంమీద కలంపడలేదు. పడే వంతెన మూడ కొడ్తారెందుకు?

శ్రీధ—మువ్వారుకోవద్యూ - నీకు తెలియదు. వూరికి వంతెన వేయించినా నేనే వేయించాలి - వూడగొట్టినా, నేనే వూడగొట్టాలి!

ఆనం—ఆ పసివద్దు. వంతెన వేయించి వూరుకుందాం - మరి చందా వేస్తారా.

శ్రీధ—వేయిస్తా నంటున్నాడుగా ఆయన. ఆయన్నే అడగండి - ముందు. ఆయన చేత గాదంటే, నా దగ్గరికిరాండి.

ఆనం—కానియ్యండి. ఏవరయితే ఏం? మీరూ...

ముకు—అల్లాగే, కాని ప్రెసిడెంటును ఊడగొడతా నంటున్నాడుగా! అదేమిటో తేలనివ్వండి! దీని సంగతిచెప్తా!

ఆనం—ప్రెసిడెంటు ఉన్నా లేకపోయినా - వంతెన కావాలి గాదండీ.

ముకు—ప్రెసిడెంటు మావాడు కాకపోతే, వంతెన మాకెందుకండీ?

ఆనం—అలా అంటారేమిటి వంతెన మీకు కాకపోతే మాకా!

ముకు—మీకక్కర లేకపోతే మీరాగండి. వంతెన సంగతి మేము చూసుకొంటాం.

ఆనం—సరి వంతెనకీ - వూళ్ళో రాజకీయాలకీ ముడిపెడితే ఎలా? అందరికీ అవసరమైంది - వంతెన!

గోపా—ఒక్క నీకు తప్ప!
శ్రీధ—నాకూ అక్కరలేదు.
గోపా—మరి కాలికి మట్టయింది.
వెంక—దీంట్లో దిగితే నెత్తికీ అవుతుంది.
ముకుం—ఎందుకండీ యీ గొడవంతా! కొత్త మాష్టరు గారూ, సాయంకాలం యిక్కడ మీ Duty అయిపోయాక, మా యింటికిరండి. ఇద్దరం కలసి, ప్రెసిడెంటు దగ్గరకెళ్ళి మాట్లాడదాం. ఆయన్ని ముందర వప్పించామంటే, వంతెన 3 నిమిషాల్లో తయారవుతుంది.
ఆనం—అక్కర్లేదు. ఈపని రాజకీయాల్లో దింపితే అయేది కాదు. శాస్త్ర ప్రయత్నించి ప్రజలందరికీ చెపితే అందరూ సహకరిస్తారు. వంతెన కోసం మీ ప్రెసిడెంటుగారికా వెళ్ళక్కర్లేకుండా, నేనే వేయిస్తాను.
ముకు—మాదాకా రాకపోతే మరీ మంచిది. అసలే తీరిక లేకుండా చస్తున్నాం! కాని, మాస్టరుగారూ – యిలా కష్టపడి పలుకుబడి సంపాదించ లేరండోయ్–యీవూళ్లో!
ఆనం—ఆ!!
ముకు—ఇది కొండతిరుగుడు పద్ధతి. తేలిక పద్ధతులు వేరే వున్నాయి.
ఆనం—ఈ వూళ్ళో పలుకుబడి నాకెందుకు? ఇవ్వాళ వుండి, రేపు వెళ్ళేవాడికి!
ముకు—మరి వూరికే మొదలెట్టారా – ఏం? యిదంతా నే గ్రహించ లేననుకున్నారా ఏమిటి? సరేలెండి, నే వస్తా! చాలా పనుంది. వస్తూ పోతూనే వుంటాగా! (వెళతాడు)

శ్రీధ—దీన్లో ఇంకా ఏమన్నా విశేషం వుందా అండి?

గోపా—వేరే ఏముందీ?

శ్రీధర—వంతెన కట్టించి మంచిపేరు సంపాదించవచ్చునా ఏమిటి?

గోపా—పేరువస్తుంది. ప్రతివాడికీ రోజూ అవసరం! కాదూ?

శ్రీధర—ఆ! స్టేషన్‌కి వచ్చినప్పుడల్లా వంతెనదాటితీరాలి - అవును.

గోపా—అవును.

శ్రీధర—వంతెన దాటినపుడల్లా దాతపేరు తల్చుకు తీర్తారు.

గోపా—ఆ-ఆ! దానిమీాద పేరుకూడా చెక్కిస్తే సరి.

శ్రీధర—చూడండి. వంతెనఖర్చు నే పెట్టుకుంటాను.

గోపా—మీరా? వంతెన అంతా!

శ్రీధర—ఆ. అంతా. మానాన్న పేరున కట్టిస్తాను.

గోపా—అసలే ఎలెక్షనులో చాలా నష్టపడ్డారులాగుందీ.

శ్రీధర—అయినా ఫరవాలేదులెండి. మాఆవిడ ఆస్తి అలాగే వుంది.

గోపా—ఆహా - ఇంకా వుందీ?

శ్రీధర—ఉన్నా లేకపోయినా, అదృష్టంవుంటే - ముందు, ముందు పైకిరాలేమా? సంపాదించలేమా?

గోపా—ఏదో 5 Year Plan వేస్తున్నారు?

శ్రీధ—కానియ్యండి. ఇది ఖాయం. 3 వేలు కానివ్వండి - 4 వేలు కానివ్వండి. వంతెన మనపేరున పడాల్సిందే. వంతెన మనపేరుతోపడితే, ఓట్లు మనకెందుకు వెయ్యరు?

ఆనం—కాని, అంత స్వలాభంతో చేస్తే-దీన్లో ..చితనం మాయ మవుతుంది.

శ్రీధ—స్వలాభమా!!

ఆనం—ఓట్లు ఈవిధంగా కొందామని మీవుద్దేశ్యం.

శ్రీధర—అయితే!

ఆనం—ఓట్లకేం విలువలేదని మీ అభిప్రాయం.

శ్రీధర—ఆమాట నే నన్నానా! ఓటు కయిదుగూపాయలు యీచేత్తో యిచ్చాగదండీ!

ఆనం—మీ ఓట్లగోల యీపనిలోకలపకండి. మీరు కల్పించుకోకపోయినా వంతెన ఆగిపోదు,

శ్రీధర—అయితే మీరే కట్టిస్తారా!

ఆనం—ఆ. ప్రజలందరూ తలోరూపాయి వేసినా చాలు. వంతెన తయారవుతుంది.

శ్రీధర—అయితే నన్ను కల్పించుకోవద్దంటూరా!

ఆనం—అనే అంటాను.

శ్రీధ—ఎందుకొచ్చినగోలండీ–నేకట్టించేస్తానంటే!

ఆనం—అక్కర్లే.

శ్రీధ—అక్కర్లేదేమిటి. వంతెన మాకందరికి కావాలి. మేమే కట్టించుకొంటాం. నువ్వుకట్టిస్తే ఆవంతెనమీద మేం నడవం.

గోపా—నడవరూ?

శ్రీధ—నడవం. మావంతెన మేమే కట్టించుకొంటాం. మావంతెనమీదే మేం నడుస్తాం.

గోపా—అయితే మనవూరికి మూడువంతెనలు పడతాయి, పక్క దెబ్బన. మీరిద్దరూ కట్టిస్తే-ప్రెసిడెంటుగారు వూరు కుంటారా?

శ్రీధ—పడినాసరే; మావంతెనమాదే; కానియ్యండి.

(ప్రక్కకుపోయి కూర్చుంటాడు).

వెంక—అబ్బబ్బ! రైలుకు ఇంకా ఎంత ఆలశ్యం వుందసీ?

[రంగయ్య ప్రవేశించి]

రంగ—టికెట్లకోసం జనం గోలచేస్తున్నారండి.

ఆనం—ఆ! పద. Time అయింది. (ఆనందం లోపలికి వెళ్తాడు రంగయ్య Plɜtform మీదికి వెళ్తాడు)

[కవి ప్రవేసిస్తాడు]

కవి—రైలుకి ఇంకా ఎంత ఆలస్యం ఉందండీ?

గోపా—వస్తూంది. టికెట్లిస్తున్నారు. తీసుకోండి.

కవి—ఆ. చీకటి పడింది. Platform చాలా నిశ్శబ్దంగా వుంది. అట్టే జనం లేరు. చుక్కలు ఇప్పుడిప్పుడే కన్పిస్తున్నాయి.

గోపా—టికెట్లిస్తున్నారండి.

కవి—ఆ...ఆ. టిక్కట్టు తీసుకోవాలిగదూ. మరే; కిటికీ అటుకదూ? (జేబులో చెయ్యిపెట్టి) అరే! (అని ఆగి పోతాడు) పర్సు...నా పర్సు...(వెతుకుతాడు)

గోపా—ఆ! పోయిందా?

కవి—ఈ జేబులో ఉండాలండీ?

గోపా—ఉందా - లేదా ?

వెంక—ఇంకేం వుంటుంది ? అయినా కవిగారూ! ఈ వంటితో పాటు మనసూ దగ్గరే వుంచుకోవాలండీ. (శ్రీధరంతో) ఏదో ఆలోచనలో ఉన్నారు. మీరు టికెట్టు తీసుకోరా?

శ్రీధ—ఆ...ఆ. తీసుకొందాం (అని లేచి జేబులో చెయ్యి పెట్టి) అరే!

వెంక—అదేమిటి ?

శ్రీధ—Purse ? నా Purse !!

గోపా—మీ Purse పోయిందా ?

శ్రీధ—అవునండీ, ఈ జేబులో పెట్టాను.

[రంగయ్య, ముకుందం, మరికొందరూ ఇందాకవచ్చిన కుర్రాణ్ణి లాక్కొస్తారు]

ముకు—కూర్చో యిట్లా. Purse కొట్టటానికి జేబులు తడుము తున్నాడండీ...Booking దగ్గర.

మూగినప్రజలు—తన్నండి గాడిదను—పొడవండి వెధవను !

రంగ—వెతకండి. Purse వుంటుంది.

శ్రీధ—ఆ. నా Purse వుండాలి.

కవి—నాదికూడా (ముకుందం దొంగకుర్రాడి జేబు వెతికి నాలుగు Purse లు తీస్తాడు)

గోపా—నాలుగున్నాయా !!

(అందరూ ఎవరి పర్సుకోసం వారు ఎగబడతారు)

శ్రీధ—నా Purse వుందేమో చూడండి (తనుచూచి) యిది నాదే.

కవి—మరి నాదో! (పర్సులు తీసుకుని) ఇదా - ఇదా...

దొంగకు(ర్రా—ఎవరిది వారే తీసుకోండి బాబూ.

ముకు—నోరు ముయ్ ! దొంగ వెధవ !

వెంక—నీతులు చెప్తున్నాడు. దొంగగాడిద. చెట్టుకు కట్టి తన్నండి ! చూస్తారేమిటి !

ముకు—పద వెధవా. పద.

(ప్రజలందరూ కల్సి వాణ్ణి లాక్కుపోతారు)

[లోపల్నించి ఆనందం జండాలతో బయటికివస్తూ]

ఆనం—రంగయ్యా!...రంగయ్యా...బండివస్తూంది - Bell కొట్టు - గేటువెయ్యి.

రంగ—ఆ. ఆ. వస్తున్నానండి.

ఆనం —అదేమిటి - ఆ గోల !!

గోపా—జేబుదొంగని పట్టుకున్నారు - కొడుతున్నారు.

[రంగయ్య Bell కొడతాడు. స్టేషన్లో సంరంభం బయలుదేరింది]

—: తెర :—

4

# రెండవ రంగము

రెండురోజుల తర్వాత 4 గంటలబండి వచ్చి వెళ్ళింది-ఇంకా చీకటి పడలేదు. స్టేషన్ అంతా నిశ్శబ్దంగా వుంది.

[ఆనందం. దొంగ కుర్రాడు తీరుబడిగా మాట్లాడుతూ కూర్చుని వున్నారు. రంగయ్య లాంతరు స్తంభాల గ్లాసులు తుడుస్తున్నాడు]

ఆనం—నీ పేరూ?

దొంగ—రత్నం.

ఆనం—మొన్నెప్పుడో నిన్నేగా పట్టుకు తన్నారు.

రత్నం—నిన్ననే కదండి!

ఆనం—అహా! అటు మొన్న సోమవారం?

రత్నం—ఆ, మరే - నిన్న వూళ్ళో గుడిదగ్గర లెండి.

ఆనం—నిన్న వూళ్ళో గుడిదగ్గర తన్నారా!

రత్నం—ఏదో లెండి. ఒక్కొక్క వారం అలా జరుగుతుంటుంది. ఒక్కొక్కవారం పోలీసువాడి జేబులో చెయ్యి పెట్టినా దులుపుకు పోతాడు.

ఆనం—ఊఁ, వక్కొక్కప్పుడు జైలుకీ వెళ్ళవలసి వస్తుంది.

రత్నం—అది ఎప్పుడో లెండి - మామూలుగా, రెండు కొట్టి వదలి వేస్తారు.

ఆనం—ఆ తన్నులు తినేప్పుడన్నా "ఛీ! ఎందుకు చేశాం; ఛీ! పని" అనిపించదు?

రత్నం—ఎందుకంటే! నాకు తెలుసుగా ఎట్లాగో వదలి వేస్తారని!

ఆనం—ఎన్నాళ్ళనుంచీ యిలా జేబు దొంగతనం చేస్తు న్నావ్?

రత్నం—ఏం? నాకు తెల్సినప్పటినుంచీ ఈపనే చేస్తున్నాను.

ఆనం—ఇంతకంటె ఏదో వక కష్టంచేసి సంపాదించుకోలేవ్వూ?

రత్నం—ఇది మాత్రం కష్టం గాదుటండీ!

ఆనం—కాని ఇంతకంటే పరువుగా, మర్యాదగా సంపాదిం చుకు బ్రతకవచ్చుగా!

రత్నం—కానీ – ఏ పనీ యింత సరదాగా వుండదండీ.

ఆనం—తన్నులు తినడం – సరదాగా వుంటుందా!

రత్నం—ఎప్పుడో ఓసారి తన్నులు తిన్నా – సరదాగానే ఉంటుందండీ. సినిమాల్లో నాయకుడికి కష్టాలు లేకపోతే, సరదా యేంవుంటుందండీ?

ఆనం—ఊ!!

రత్నం—ఇక పరువు మర్యాదలంటూరా! మాలో నాకు చాలా మర్యాద యిస్తారు. ఎవరి వాళ్ళల్లో వాళ్ళకి మర్యాద చాలదండీ.

ఆన—మాలో అంటే మీ దొంగల్లోననా?

రత్నం—ఆ – అల్లాగే అనండి – పోనీ. మాలో ఒక దారులు కొట్టే దొంగ వెధవున్నాడు. వాడికి జేబులు కొట్టడం రాదు. వాడంటూ వుంటాడు లెండి–నన్ను చూచి "నువ్వే

నయం రా; వకణ్ణి కష్టపెట్టకుండా నువ్వు కష్టపడకుండా సంపాదిస్తావ్." అని.

ఆనం—అదంతా అలావుంచు, ఇకనన్నా వేరేదన్నా వుద్యోగంచేసి, యిది వదిలెయ్యటానికి ఆలోచించు. శుభ్రమైన కుర్రాడివి. ఈ దొంగతనంలో ఏం సుఖముందనీ.

రత్నం—ఈ వృత్తిని నీచంగా చూస్తారు మీరు! చూడం మేము, ఇదీ వకవిధమైన మోసం అని వప్పుకుంటా. మనిషికి తెలీకుండా డబ్బులాగెయ్యటం-యేమోసమైనా అంతేగా.

ఆనం—పోనీ, ఆ మోసం చెయ్యటం మాత్రం మంచిదా?

రత్నం—మంచిది కాదుకాని మోసం దేంట్లోలేదు? మోసం చెయ్యకుండా సంపాదించే దెట్లా? ఏ వృత్తిలోనైనా పరాయివాణ్ణి పీడించకుండా ఎవరు బ్రతుకుతున్నారు చెప్పండి? ఇంకా మేమే నయం. మనిషికి తెలియకుండా జేబులు కొడతాం. తర్వాతచూసుకుని కాసేపు ఏడుస్తారు.

ఆనం—బాగుంది - వేదాంతం!

రత్నం—మీకు తెలియదండీ బాబుగారూ; పాప మని భయపడితే బ్రతకలేం ఈ ప్రపంచంలో.

ఆనం—నేను నిన్ను మార్చాలని చూస్తున్నాను. కాసేపటికి నువ్వే నన్ను మార్చేట్లున్నావ్.

[రంగయ్య ప్రవేశిస్తాడు]

ఆనం—ఎక్కడికి వెళ్లేవోయ్; రంగయ్యా!

రంగ—ఇక్కడే నండీ. మళ్ళీ బండి రాత్రి 10 గం॥ లకే గదండి.

ఆనం—అందుకని ?

రంగ—అహా ఇక్కడేం పని లేదుగదండి. కాస్త అట్లా వెళ్ళొస్తాను.

ఆనం—ఊఁ.

రంగ—అమ్మగారిందాక కిర్సనాయిలు అయిపోయిందన్నారు.

ఆనం—ఊఁ ? పోయి, కొనుక్కురా.

రంగ—ఎందుకండీ - స్టేషనులో ఉందికదండీ - మిగులు.

ఆనం—మిగులా - ఎట్లా వుందీ !

రంగ—కిర్సనాయిల్ ఎప్పుడూ మిగుల్తానే ఉంటుంది లెండి.

రత్నం—మిగుల్తుంది లెండి. వెలిగి స్తేగా కర్చు కావటం ! వెల్గించి వెంటనే ఆర్పేస్తారుగా !

రంగ—మరి-ఒకగాలన్ ఇంటికాడ యిచ్చొస్తా.

ఆనం—వద్దు. ఇంటికక్కర్లేదు, కావల్సింది, కొనుక్కుపట్టికెళ్ళు.

రంగ—అల్లాగేనండీ. బాబుగారూ - రాత్రికాస్త ఆలస్యంగా వస్తానండి.

ఆనం—ఏం?

రంగ—ఏంలేదండీ - కాస్త వేరే పనివుందండీ.

ఆనం—అల్లాగే. ఫో.

రంగ—వస్తానండీ. పదరా - ఇక్కడే కాపలా వేశాం వే ఇవ్వాళా ?

రత్నం—వస్తున్నాలే - పద. (ఇద్దరూ వెళ్తారు).
[గోపాలం, కవి ప్రవేశిస్తారు]
గోపా—ఏంచేస్తున్నావోయ్ ఆనందం?
ఆనం—ఏంలేదు. ఊరికేనే వున్నా.
గోపా—ఆ! రండి. వీరెవరో తెలుసా. ఎవరో అనుకొన్నావు— మనవాడే. వీళ్ళనాన్నా - నేనూ చదువుకున్నాం. వీళ్ళ నాన్న బాగాసంపాదించి వీళ్ళమ్మకురాసి పోయాడు. అల్లా కూర్చోవయ్యా - కూర్చో.
ఆనం—రండి - దయచేయండి! (కుర్చీచూపిస్తాడు.)
గోపా—అలా చెరువుగట్టుకి వెళ్తే కొంగల్తో ఏదో మాట్లాడు తున్నాడు. ఏమిటూ అని పలకరిస్తే - తీరా మనవాడే. సరేనని లాక్కొచ్చాను.
ఆనం—కొంగల్తో ఏదో మాటలా!
గోపా—అదేమిటంటే ప్రకృతిలో మునిగిపోయానన్నాడు.
కవి—కొంగలు చూశారా! ఎంత స్వచ్ఛంగా వుంటాయ్. ఆ తెల్లని రెక్కలు మెల్లగా ఆడుతూ.........
గోపా—ఇదిగో అబ్బాయ్! నిన్ను చూస్తుంటే మీనాన్న జ్ఞాపకంవస్తున్నాడు. నాకోసం నాతోబాటు ఈప్రపంచం లోనే వుండు, కాసేపు.
కవి—అదెల్లా సాధ్యమవుతుందీ?
గోపా—ఏంకాక ?
కవి—సామాన్య ప్రాపంచిక విషయాన్ని నే నెన్నడో విస్మ రించాను. నాక్కావాల్సిందల్లా- ఆ నగ్న సౌందర్య స్నిగ్ధ ప్రకృతీసుందరి,

గోపా—అంతే - ఇందాక కనిపించిన దొంగా!

కవి—ప్రాతస్సూర్యకేంద్ర కిరణకాంతీ సముద్దీపిత సౌందర్య పులకిత.........

గోపా—నీకీ ప్రపంచంలో సౌందర్యవతు లెవరూ పనికిరారా, ఏం?

కవి—పనికివచ్చేవాళ్లు కాకుండా పోయినతర్వాత, ఎవరు పనికి వచ్చేం ప్రయోజనం?

గోపా—ఏమిటేమిటీ! వెనక కథ చాలావుందల్లేవుందే?

కవి—హృదయ వేధల నిచ్చే కథల కేం తక్కువ?

గోపా—ఏదీ-కాస్త వినిపించు?

కవి—మూడుపేళ్ళక్రిందటి మాట. పట్నంలో కళాశాలలో కళావతిని ప్రేమించాను. కలకంఠి కంఠస్వరం వింటే చాలనే విలవిల లాడేను. కలకాలం కన్నీరొలకగా, ఆమె పాటే పాడాను-ఆమె మాటే తలచాను. విఫలుణ్ణై చివరికి ప్రపంచాన్నే విస్మరించాను.

గోపా—ఇది నీసంగతి-మరి ఆమెసంగతి?

కవి—ఆమె కేవలం కామంలో క్రుంగిపోయింది. నన్ను కాదని వేరే కాలేజీకుర్రవాణ్ణి కామించింది. అప్పట్నించీ ఆ కామిని ప్రతిరూపం హృదయ ఫలకంమీద చిత్రించుకొని ప్రకృతిలో రూపొందించుకొని, సౌందర్య రసోపాసి నై పోయాను.

గోపా—నిన్ను కాదనిపోయినా - ఆ అమ్మాయినే ప్రేమిస్తున్నావన్నమాట.

కవి—అవును! అనే అనాలి. నేను ప్రేమించిందా దివ్య సౌందర్యాన్ని - ముగ్ధ హృదయాన్ని, ఆ భౌతిక శరీరాన్నిగాదు. అన్యాసక్త మనస్సునూ కాదు, సౌందర్యం ఎక్కడున్నా ఆరాధించ తగ్గదే.

గోపా—బాగుంది. ఆనందంగా వుంది. ఆనందం (ఆనందంతో) అందుకని వీరు రోజూ సాయంత్రం కాంగానే, రైలెక్కి ఈ వూరొచ్చి ఇక్కడున్న చెరువుగట్టున నాటు కొంగల సౌందర్యం ఆరాధించి రాత్రి బండికి వారి వూరు చేరుకుంటారు. ఈ ఆరాధనలో ఒకప్పుడు కొన్ని టిక్కెట్టు పోతుందిట, కనక కాస్త కనిపెట్టి వుండు.

ఆనం.—అల్లాగే కూర్చోండి కవిగారూ (లోపలికి వెళ్ళబోతాడు)

గోపా—అన్నట్లు నీ వంతెన సంగతేమయింది. మర్చిపోయావా దాని సంగతి.

ఆనం.—లేదు. 200 రూ॥లు చందా పడ్డది.

గోపా—నీది కాకనా!

ఆనం—అంతా కలిస్తే......ఆ...మరి...కవిగారు మనకేమన్నా చందా వేస్తారేమో!

కవి—దేనికీ చందా?

ఆనం—ఆ! ఏం లేదు. అక్కడ పంట కాలవుంది - చూశారూ దానికి వంతెన కట్టించాలని. చూశారూ మనం, అన్ని పనులూ గవర్నమెంటు చెయ్యాలని కసి

పెట్టుకు కూర్చోకుండా, కొన్ని మనమే పూనికొని నిర్వ
హిస్తే యిట్లాంటివి తొందరగా తెముల్తాయి. అందుకని
మన వంతెన మనమే......

కవి—కట్టగూడదు. ఈ వంతెనలూ కాలువలూ వచ్చి
ప్రకృతి సహజ సౌందర్యాన్ని కలుషితం చేస్తున్నాయి.
నేను అందుకు చందా వేయను. కావాలంటే కాలవలు
పూడ్చి వేయటానికి చందా వేస్తాను.

ఆనం—ఆ !

కవి—కాలవలొచ్చి చెరువులు కరువయ్యాయి. కలువలు
కరవైపోయాయి. ఆ కలువలూ లేవు – కన్నియ్యా లేవు.
కవి కలానికి కౌతూహలాన్నిచ్చే కళావస్తువులుకరువయి
కావ్యాలన్నీ నీరసాలౌతున్నాయి !

గోపా—ఇక లాభం లేదులే ! వదిలెయ్యి. ఆ – మరి – రెండు
వందలు ఎవరు వేశారు ?

ఆనం—'సుందరం' అని వక కాలేజీ కుర్రాడు. ఇక్కడున్న
వాళ్ళు తనూ వచ్చి పని చేస్తానన్నాడు.

గోపా—కానీ...తంటాలుపడు. ఈ రంగయ్య ఏడీ ? కను
పించడు. వీరయ్య ఇంటికి వెళ్ళాడా?

ఆనం—ఏమో ! కాని – ఏమిటీ – మాట మాట్లాడితే మీరు
వీరయ్య సంగతెత్తుతారు?

గోపా—అదో గోల. వీరయ్యకు ఒక పడుచుపెళ్ళాం వుంది.
అందుకని వీడు – అక్కడే తిరుగుతుంటాడు.

5

ఆనం—ఆరి వెధవా! అదా!

గోపా—తెల్లబోతావేం? రంగయ్య చేస్తున్న పనికేనా! రంగయ్య అది తప్పని ఒప్పుకోడు - నువ్వు ఒప్పించలేవు. తెలుసా! తనుచేస్తున్న పని న్యాయమనే వాడి ఉద్దేశ్యం.

ఆనం—అల్లాగేవుంది చూస్తే. ప్రతివాడికీ చేస్తున్నపనికి ఆదర్శం అథారిటీగా చూపించటం అలావాటైపోయింది. ఆ జేబుదొంగా అలాగే అన్నాడింందాక. (ముకుందం గబగబా ప్రవేశిస్తాడు)

ముకు—మాష్టగారుకూడా ఇక్కడేవున్నారే! మీతోనే పని వుండి వచ్చా.

గోపా—ఆ! నాతోనా?

ముకు—మీతోనూ-కొత్తమాష్టారితోగూడా.

గోపా—ఏమిటి?

ముకు—కాస్త ఇలారండి.

గోపా—(అటువెళ్తూ) రహస్యమా?

ముకుం—పెద్ద రహస్యమేం లేదు. ఈరోజుల్లో అందరికీ తెల్సిందే - చూడండీ - శ్రీధరానికి రెండువేగన్లు వస్తున్నాయి.

(గోపా వస్తున్నాయా అన్నట్లు ఆనందంవైపు చూస్తాడు. ముకుందం అడ్డొచ్చి)

ముకుం—వస్తున్నాయిలెండి - రాత్రికి.

గోపా—అహా!

ముకుం—ఆయన Loading కి కాస్త ఆలస్యం వుంది. ఉన్నా లేకపోయినా Wagon లలో మన సరుకెత్తించి తెల్లారి పొద్దున్నే బండికి తగిలించేద్దాం. శ్రీధరం ప్రొద్దునవచ్చి అడిగితే ఏదో చెప్పెయ్యవచ్చు.

ఆనం—వేగన్లు వస్తున్నాయని మీకెలా తెల్సింది?

ముకుం—ఏం ఎరగనట్టు మాట్లాడతారేం మాష్టారూ! మనకి ఆగడపదాటకుండా వూళ్ళో సంగతులూ, గడపదాటితే జిల్లా సంగతులూ, ఏనిమిషానికానిమిషం తెలిసిపోతాయి.

ఆనం—కాని శ్రీధరంగారుకూడా రోజూవచ్చి కనుక్కుపోతున్నారు. ఆలస్యమైతే సరుకు పాడయిపోతుందని, తొందరపడుతున్నారు.

ముకుం—పాడయేమాట నిజమే. అసలు పాడయిన సరుకేగా ఆయన రవాణా చేసేది.

ఆనం—అది మాకెందుకు? ఆయనకోసం వచ్చిన వేగన్లు మీ కెట్లా యిస్తామనుకున్నారు?

ముకుం—ఆయన వేగన్లు వేరొకరి కిచ్చారని బయటకొస్తేగా! ఆయన వేగన్ల నడిగినట్లు ఎవరికి తెలుసు! కాదా అంటే పై ఆఫీసులో కాగితాలుగూడా కాల్చిపారేయిద్దాం.

గోపా—ఆ - ఆ - మీారంత సమర్థులే!

ముకుం—మనసంగతి కొత్తమాష్టారుగారి కింకా బాగా తెలియదు.

ఆనం—ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. వేగన్లుమీావికావు. శ్రీధరం గారివి. అవ్వి మీకివ్వటంలో నన్ను అన్యాయం చెయ్యమంటున్నారు.

ముకుం——ప్రారికే చెయ్యనక్కర లెండి. రెండునెంద లు గిట్టేట్టు చూస్తాను.

ఆనం——ఏమంటారూ ?

ముకుం——మాకు సాయంచేస్తే - మా లాభంలో కొంత మీకు............

ఆనం——చాలా దారుణంగా వుందే.

ముకుం——దారుణ మేముందండీ-మామూలే. ఏం, మాష్టరు గారూ మాట్లాడరేం !

గోపా——కాని ఆనందరావుకింకా అలవాటు కాలేదండి.

ముకు——మీరున్నారుగా! ఎల్లాగో అల్లా సెటిల్ చేసెయ్యండి ఏం ? నే వెళ్ళిరానా ?

(కవి ఏదో ఆలోచిస్తూ దూరంగా వెళ్ళిపోతాడు. అతన్నెవ్వరూ గమనించరు.)

ఆనం——వెళ్ళండి. మళ్ళీ రానక్కర. నాష్టరుగారూ! ఇంక ఇకను మీరు యిక్కడ వుండొద్దు.

ముకు——ఉత్త చాదస్తుల్లా గున్నారేం!

గోపా——ఇదో రకం లెండి.

ము——ఏరకమైనా, యిట్లా అగౌరవంగా మాట్లాడతారేం ? పెద్ద మనుష్యులని మర్యాదా అక్కర్లేదే! కాస్తంత అధికారానికి కొండంత గర్వం. కానియ్యండి. వస్తా! (కోపంగా వెళతాడు)

గోపా——అదేమిటోయ్ ఆనందం! వెనకాముందూ ఆలోచించకుండా అంతేమాట అనేశావ్ ?

ఆనం—ఏమన్నాను! లంచం ఇవ్వటానికి రావద్దన్నాను. నీతిగలవాడెవడైనా ఇలాగే అంటాడు.

గోపా—నీ 'నీతి' నీళ్ళల్లో కలుపు. కోరి కజ్జా తెచ్చుకుంటూవా! దానికీ చెప్పేపద్ధతి అక్కర్లేదే? వాడు వూళ్ళో నల్గురిలో తిరిగేవాడు.

ఆనం—అయితే లంచం పుచ్చుకోలేదని నామీద నేరం మోపుతాడా?

గోపా—ఈ పేరున కాకపోయినా మరో పేరున సాధిస్తాడు.

ఆనం—ఏం సాధించటానికైనా మనం తప్పు చేస్తేనేగా!

గోపా—తప్పు చెయ్యకుండా బ్రతకగలమా! మనం తప్పని వప్పుకోనివీ ఇతరులు తప్పుగా పరిగణించేవీ లేవూ?

ఆనం—ఉన్నాయేమో! కాని యిటువంటివాళ్ళు దగ్గరకు రాకుండా వుండాలంటే ఇదొక్కటే పద్ధతి.

గోపా—వాడికి దగ్గరికి రాడు. దూరాన్నుంచే రాళ్ళువిసురుతాడు. రాయి తలమీద పడితే బొప్పి కట్టకపోదు.

[రంగయ్య వస్తాడు]

రంగ—కిరసనాయిల్ ఇచ్చొచ్చా బాబూ.

గోపా—ఏం అట్లావున్నావ్? వీరయ్య ఇంటికి వెళ్ళలే.

రంగ—వూళ్ళో లేడు గదండీ. రేపు సాయంకాలానికిగాని రాడు.

[బిచ్చగాడు వస్తాడు]

బిచ్చ—అబ్బాయి ఇటొచ్చాడా రంగయ్యా!

రంగ—వచ్చి వెళ్లాడుగా - ఇందాకే.

ఆనం—అబ్బాయి ఎవరు వీడికి ?

రంగ—ఆడండీ, ఇందాక - మీతో మాట్లాడి వెళ్ళాడా. ఆ జేబులు కొట్టేవాడు

ఆనం—వాడు. నీ కొడుకా ?

బిచ్చ—ఏం కొడుకో బాబూ! ఉండీ లేని కొడుకు. ఏపూట ఎక్కడుంటాడో! ఏమో!

ఆనం—అల్లా దిలేవు గనకే అల్లా తయారయ్యాడు! అయితే వాణ్ణి దొంగని చేసింది నువ్వేనన్నమాట!

బిచ్చ—నేనే బాబూ నేనే! తిండి పెట్టలేక - దొంగను చేశాను.

ఆనం—తిండి పెట్టలేక పోయానని దొంగను చేస్తావుటయ్యా ?

బిచ్చ—ఏం చెయ్యను బాబూ? కడుపు కాల్చి ఇంట్లో కూర్చోపెట్టనా! కన్నాను కనక "దొంగను చేసిన పాపం" నేనే నెత్తిన వేసుకుంటాను. దొంగిలించి వాణ్ణి ఆకలి తీర్చుకో నివ్వండి.

ఆనం—పాపం-పుణ్యాం తెలిసేనా ? ఎవణ్ని కదలించినా వేదాంతం వలక బోసేవాడే యీ రోజుల్లో.

బిచ్చ—వేదాంతం కాదు బాబూ. వాడు చేసే పని పాడు పనే. వాణ్ణి కేకలేసి సరిదిద్దటానికి నే చేసే పని మంచి పని గనకా ? నన్ను చూడండి. అడుక్కు-తినటం తప

వేరే గతిలేక అడుక్కు తింటున్నాను. ఆ అడుక్కు తింట మైనా ఎట్లా...“కుంటివాణ్ణి బాబూ” చెట్టంత కొడుకు చచ్చిపోయాడు బాబూ;” అని కొడుకు చచ్చాడూ. అని అబద్ధం. అంతా అబద్ధమే. కాని అబద్ధాలాడితే గాని దమ్మిడీ ధర్మం పడదు. నేనే గాదు. మే మందరం అంతే. మావాళ్ళేమిటి - అంతా అంతే. ఎన్ని అబద్ధాలాడితే అంత సంపాదించవచ్చు. అబద్ధం ఆడితే గాని అసలు సంపాదించలేరు. మేము ఈ అబద్ధా లాడతాం. ఇతర అబద్ధా లాడినా నమ్మరు. మా అంతస్థుకి యీ అబద్ధాలే. అబద్ధాలాడటానికీ అంతస్థు కావాలి. “గతిలేనివాణ్ణి బాబూ” అని మొత్తుకొంటె... నమ్మి డబ్బిస్తే వాడుంటే - అబద్ధాలాడతామా! అబ ద్ధానికేఆదరణ వుందిగనక ఆడతాం-ఎన్ని అబద్ధాలైనా.

రంగ—సరేలే! కుంటికాలు సంగతి మర్చేపోయాయ్. జనం చూస్తే పట్టేస్తారు జాగ్రత్త.

బిచ్చ—మర్చిపోలే. ఇప్పుడల్లా - జనం రారులే. వేషం అక్కర్లే వస్తా బాబూ. మా చచ్చు రకాన్ని యిలా వదిలెయ్యండి. మారాజులు బాగా వుంటే మా కదే చాలు. (వెళ్ళబోతాడు)

ఆనం—ఈ వేషాలన్నీ పొట్ట తిప్పలకేగా?

బిచ్చ—ఆ తిప్పలు తక్కువ్వా బాబూ.

ఆనం—అయితే కానీ - పదిరూపాయలు నేనిస్తాను. మీ తండ్రీ కొడుకూ కల్సి ఏదో వ్యాపారం పెట్టుకోండి.

బిచ్చ—వ్యాపారమా!!

ఆనం—ఆ,

బిచ్చ—అబద్ధాలాడకుండా మోసం లేకుండా చెయ్యాలిగా బాబూ!

ఆనం—ఆ.

బిచ్చ—అబద్ధాలాడకుండా చేతకాదు బాబూ.

ఆనం—ఏం?

బిచ్చ—అబద్ధాలాడకుండా లాభాలొట్టే రావు.

ఆనం—అయితే అందరూ అబద్ధాలాడుతున్నారా?

బిచ్చ—ఆడటంలే. వాళ్ళ పొట్టా గడవటంలే. అయితే వాళ్లు నాకు మల్లే మారిపోకుండా, పరువుపోకుండా, పరువు కోసం పాకులాడుతున్నారు (వెళ్ళబోతూ) వస్తా బాబూ వస్తా, రంగయ్యా మావాడొస్తే. కొంచెం కనపడమని చెప్పూ. నీ కడుపున పుడతాను.

రంగ—చంపావ్ - ఆ పని చెయ్యకు (అందరూ నవ్వుతారు)

బిచ్చ—(వెనక్కి తిరిగి) లేదులే. అలా [illegible]మీద అనేశాను. లేదులే... (అంటూ వెళ్తాడు)

గోపా—ఇల్లా ఎంతమందిని సంస్కరిస్తావురా అనంతం!

ఆనం—నా సాధ్యమయినంతమందిని.

గో—"జీతంరాళ్ళు జేబులో వున్నంతవరకు" అను.

ఆ—(నవ్వి) అలాగే అంటావున్నా నవ్వుతారుగదా - పిచ్చి బోటివాళ్ళు.

గోపా—ఏమిటో నీ దంతా విపరీతంగా వుంది. ఈ సంస్కా రం మీాద వేసుకుని ఏం సాదిస్తావ్!

ఆనం—కానియ్యండి. ఏం లేకపోయినా తోటి మనిషికి సాయం చేశానన్న తృప్తినా వుంటుంది. కాని మోసం చెయ్యకుండా బ్రతకనే లేమంటా డేమిటి? మోసం చెయ్యకుండా ఇద్దరి పొట్ట గడవదూ!

రంగ—ఇద్దరు కాదు బాబు. ఆ ముసిలాడు మరిద్దర్ని పోషిస్తు న్నాడు.

ఆనం—ఏమంటావ్!!

గోపా—ఇంకా కొడుకులున్నారా!

రంగ—లేరు కాని తల్లీ తండ్రీ లేని యిద్దరి పిల్లల్ని సాకు తున్నాడు.

ఆనం—అహా!

గోపా—ఎవరు వాళ్ళు!

రంగ—అనాకత్తె కని పడేశింది లెండి – పాడుముండ. అదే, పొట్టకోసమే ననుకోండి – చెడిపోయింది. కడుపుతో వుం డగా దాన్నెవరూ కన్నెత్తిచూడలేదు. నెలలు నిండి చచ్చిపోయింది. దానిపిల్లలిద్దరూ అల్లాడుతుంటే, పాలెంలో ఎవ్వరూ పట్టించుకోలే. వూరిమీాద బిచ్చమెత్తి వీడు వాళ్ళిద్దర్ని పెంచుతున్నాడు – తన కొడుకును వూరిమీాద కొదిలి. అంతా అయిదేళ్ళనాటి సంగతి లెండి. అంతకు పటంను యీా ముసిలాడు మిల్లుకాపలా కాశేవాడు. ఈ

పిల్లల్ని పెంచి - తన పిల్లాడిసంగతి పట్టించుకోకపోతే - ఆ పిల్లాడు పెరిగి జేబులుకొట్టడం ఆరంభించాడు.

ఆనం—ఆ!

రంగ—పిల్లాడు దొంగ వెధవని మిల్లులోంచి తీశేశారు - వీణ్ణి. వేరే గతిలేక బిచ్చమెత్తుతున్నాడు.

ఆనం—ఉహూ.

రంగ—అందుకనే మేమందరం చూసీ చూడనట్టు వూరు కుంటాం.

[శ్రీధరం గబగబా ప్రవేశిస్తాడు]

శ్రీధర—మా వేగన్లు వచ్చాయటగా. ఏమండీ, వేగన్లు వచ్చాయటగా?

గోపా—ఏమిటండీ కంగారు!

శ్రీధర—అదే మా వేగన్లు వచ్చాయటగా! అహ! రాత్రికి వస్తాయటగా! ఆ మావాడు Wire యిచ్చాడులెండి - ఈ రాత్రికి వస్తాయని.

గోపా—అదా! రాత్రికి వస్తాయట లెండి.

శ్రీధ—మావాడు ఆవ్రాళ్ళే Book చేశాడు, నానాతంటాలు పడి, అబ్బ! మహాతంటాలుపడ్డాడు లెండి! వందరూపాయలు లంచంగూడా పెట్టాడు ఏమయితే ఏం? వచ్చాయి. లేకపోతే సరుకు పురుగుపట్టి పాడయిపోయేది.

గోపా—అల్లాగా?

శ్రీధర—కాదండి మరి! ఇంకా రెండురోజులు ఆలస్యమయితే 10-15 వేలదాకా మునిగిపోయ్యేవాళ్ళం. వేగన్లకొత్తి

పారేస్తే తర్వాత ఏమయితే ఎవనికక్కావాలి. అయితే సరుకు ఇక్కడికి చేర్పిస్తాము - రేపొద్దున్న రైలుకి తగి లించేద్దాం. ఆ, మాష్టరుగారూ! (50 రూపాయలు తీసి యిస్తూ) ఇది మీరు చేసిన సాయంకాకపోయినా విశ్వాసం చూపనీకం కాదు నాది. ఇందండి.

(రంగయ్య వెళ్ళి పాలుదీ వెలిగిస్తుంటాడు)

ఆనం—ఇదెందుకు?

శ్రీధ—ఉంచండి మామూలేగా! కాస్త వాకళ్ళ నోకళ్ళం కని పెట్టుండాలి. (చేతిలో పెడతాడు).

ఆనం—వినండి. మీరెవరో నాకు బాగా తెలియదు. వేగన్లు మీకొస్తే మీకివ్వాల్సిన బాధ్యత నామీద వుంది. నేను మీకివ్వననే అనుమానమేమన్నా వుందా?

శ్రీధర—లేదు.

ఆనం—అయితే ఇదెందు కిస్తారు? మీ వేగన్లు మీకివ్వటాకి నేను లంచం తీసుకోను.

శ్రీధర—ఇది లంచం కాదయ్యా! మామూలు.

ఆనం—పోనీ అదే! మీరు మామూ లివ్వాల్సిన అగత్యం లేదిందులో.

శ్రీధర—పోనీ ఇది వంతెనకు చందాగా తీసుకోండి. సరేనా?

ఆనం—దానికైనా యీరూపేణా మీదగ్గర్నించి తీసుకోను.

శ్రీధర—లేకపోతే ముట్టెత్తుతావా.

ఆనం—ఆ - ఆ ముష్టి మీరిస్తే నాకక్కర లేదు.

శ్రీధర—ఇదెక్కడ చాద స్తమయ్యా! ఎందరో స్టేషన్ మాష్టర్లని చూశానుగాని, యీరకం నే నెక్కడా చూడలే.

ఆనం—మీరు మంచి సరుకు రవాణాచేసినా కుళ్ళుసరకు రవాణాచేసినా - మీం వేగన్లు మీకే యిస్తాను. మీ పాప పుణ్యాల్లో నాకు భాగం పంచకండి.

శ్రీధర—చూశారా మర్యాదా! సరే కానివ్వండి! పాప పుణ్యాల్లో యిరుక్కోకుండా. ఎంతవరకుంటారో నేనూ చూస్తా. (కోపంగా వెళ్తాడు)

గోపా—మంచికిపోయి విరోధం కొనుక్కుంటున్నా వానందం. మంచితనానికి విరోధం ప్రతిఫలం. మంచిగా వుండటం మహా చెడ్డది. (దీపాలు వెలిగించి రంగయ్య వస్తాడు)

ఆనం—తనుచేసింది తప్పని తనకి తెల్సు. అదే మనమంటే కోపం. కానివ్వండి. ఒకరి కోపమని మనం మారిపోతామా!

గోపా—ఏమిటో.........కానీ వస్తా! ఈ కవి ఏడీ? భోజనానికివుండమన్నాను. ఏ చెరువుగట్లవెంట వెళ్ళాడో—వస్తా. (గోపాలం వెళ్తాడు).

ఆనం—(అలాగే ఆలోచిస్తూ కొంచెంసేపయిన తర్వాత) రంగయ్యా!

రంగ—(దగ్గరకువచ్చి) అయ్యా.

ఆనం—మంచిగా వుండాలని అందరికీ వుండదాయేం?

రంగ—ఎందుకుండదు బాబూ. అందరూ మంచిగా వుండాలనే చూస్తారు. కాని - అదే - సాధ్యపడదు.

ఆనం—పాపం నువ్వూ మంచిగావుండాలనే చూస్తావ్. కాని సాధ్యపడదు.

రంగ— నేనేం చేశానండీ - అట్లాం అంటారు?

ఆనం—నువ్వు చేసింది నేను విన్నాన్లే.

రంగ—ఏందండదీ!!

ఆనం—వీరయ్య ఇంటికి రోజూ వెళ్తావుట. ఎందుకు?

రంగ—(తెల్లబోయి) అది మీకెవరు చెప్పారండీ?

ఆనం—ఎవరయితే ఏం అదేమంత మంచిపనా?

రంగ—మంచిపనికాదని నాకు తెలుసు......కాని......

ఆనం—కానీ. అంటూ కారణాలు వెతికి, చెడ్డని మంచి చెయ్యాలని చూస్తావేం? చెడ్డపని అని తెలిస్తే మానెయ్యరాదు.

రంగ—వీరయ్య ఇంటికి నా అంతట నేనే వెళ్ళటంలేదండీ. ఆడిభార్య పిలిస్తేనే వెళ్తున్నా.

ఆనం—ఆ!

రంగ—అసలు దాన్ని నాకే యివ్వాలనుకొన్నారు. కాని ఈరయ్యే అడ్డొచ్చి. డబ్బెక్కువపెట్టి, దాన్ని కొనుక్కున్నాడు. దానికిష్టంలేకుండా దానికి పెళ్ళయింది.

ఆనం—కాని...?

రంగ—పెళ్ళికిముందు నా దగ్గర కొచ్చి - ఆ డబ్బు నన్నే యిచ్చి తన్ను పెళ్ళిచేసుకోమని గోలెత్తిందది. డబ్బు లేక నేనేం చెయ్యలేకపోయాను. పెళ్ళయిపోయింది.

ఆనం—ఊహూ !

రంగ—డబ్బాసపడి దాన్ని వీరయ్య కిచ్చిన తండ్రిదా తప్పు, తెలిసే - పై పోటీకొచ్చిన ఈరయ్యదా తప్పు ..నాదా ? చెప్పండి.

ఆనం—తప్పెవరిదైతే ఏం ? పరిస్థితి మారిందిగా ! ఇక వ్రాసుకోరాదూ.

రంగ—ఏం మారింది ? దానికి నామీద మనసు మారలేదు. అందుకని రమ్మని పిలుస్తుంది. కాని నా మీద పీకెదాకా కోపం - డబ్బు తెచ్చి దాన్ని సెళ్ళాడలేదని. అందుకని......

ఆనం—అందుకని...?

రంగ—అందుకని నేను వెళ్ళంగానే వీరయ్యనే కేకేస్తుంది.

ఆనం—అయితే నువ్వంటే ఇష్టం లేదన్నమాటా ?

రంగ—ఇష్టం లేకపోతే ఎందుకు పిలుస్తుందండీ !

ఆనం—ఇష్టం వుంటే వీరయ్య నెందుకు కేకేస్తుందీ !

రంగ—అదేనండి......ఆడాళ్ళ మనస్సు అర్థం కావు.

ఆనం—ఏదైనా - ఆ అమ్మాయి వీరయ్య భార్య. వాళ్ళ ఇల్లు నువ్వు చెడగొట్టట మెందుకు?

రంగ—కాని నా మనస్సులో ఇంకా అది నా భార్యయనీ, వీరయ్యే మాకు అడ్డొచ్చాడని అనిపిస్తుంది.

ఆనం—వీరయ్య దాన్ని పెళ్ళిచేసుకున్న భర్త.

రంగ—మాది మనుసులు కలిసిన మనువు.

ఆనం—అయితే - వాళ్ళ సంసారం పాడు చేస్తానంటావ్ !
రంగ—అది వస్తుకొని వస్తే - ఇది పాడు పని అవదుగదండీ!
ఆనం—ఊఁ...ఏదైనా నువ్వు వక ఆదర్శప్రకారమే నడుస్తున్నావ్ !
రంగ—వస్తా బాబూ - వీరయ్య వూళ్ళో లేడు దాంతో మాట్లాడాలి.

[ఇంతలో కవిగారు వస్తారు]

కవి—వీరే. రండి గోపాలంగారూ.
ఆనం—ఇంటికి వెళ్ళారే!
కవి—ఇంటికి వెళ్ళారా!...అరే!!
రంగ—వస్తా బాబూ తొందరగానే వస్తా.
ఆనం—ఊఁ (రంగయ్య వెళ్ళాడు. కవిగారు తెల్లబోయి కూర్చుండటం చూసి) అట్లా కూర్చున్నారేం?
కవి—ఎట్లాగండి! వారింటికి వెళ్ళాలి! నన్ను భోజనానికి పిల్చి, బండి దాటపెట్టారు.
ఆనం—అహాఁ? మీ కోసం చాలాసేపు చూశారు! వారిల్లు యిక్కడే - కాలవ దాటంగానే ...
కవి—కాలవ దాటాలా? కాలవలో బురదగాదండి! నాకు కళ్ళుకూడా బాగా కనిపించవ్.
ఆనం—అహం! ఈ రంగయ్యకూడా వెళ్ళిపోయాడే! ఎట్లా?
కవి—ఎట్లాగండీ!
ఆనం—ఎట్లా?

కవి—పోనీ - అందాకా మీరూ వస్తారా?
ఆనం—నేనే? ఎల్లా రాసూ? స్టేషన్ వదలి...
కవి—ఎల్లాగండి!!......నేనూ వెళ్ళలేను.
ఆనం—ఎందుకండీ...ఈ రోడ్డంబటి అల్లావెళ్ళి...
కవి—అక్కడ కాలవండీ.
ఆనం— ఆ...ఆ...కాలవలో బురద కూడా.
కవి—అందుకనే నేననేది- వెధవకాలవలూ ఇలా వెళ్ళలా...
వెళ్ళి...
ఆనం—కాలవదాటి అడగండి. చెప్తారు.
కవి—సరే ఇల్లాగేగా......(వెళ్తాడు)

[ఆనందం లోపలికివెళ్ళి పోతాడు. కొద్దిసేపటికిరత్నం వచ్చి Booking గేటు దగ్గర కెళ్ళి పిలుస్తాడు]

రత్నం—మాష్టరుగారూ - మాష్టరుగారూ...
ఆనం—(లోపల్నించి) ఎవరూ?
రత్నం—నే నండీ.
ఆనం—నే నంటే? (బయటికివచ్చి చూశి) నువ్వా.
రత్నం—ఆ ..మా నాన్నతో ఏదో మాట్లాడారటగా.
ఆనం—అవును. ఏం?
రత్నం—10 రూపాయలు ఇవ్వబోయారటగా?
ఆనం—కానీ - తీసుకోలేదు.
రత్నం—బిచ్చం మానేశి వ్యాపారం పెట్టుకోమన్నారటగా!
ఆనం—దాంట్లో ఏం లాభం లేదన్నాడు.

రత్నం—ఇదిగో 50 రూపాయిలు (చూపించి) నా దగ్గర మిగిలాయి - నా కేదన్నా వ్యాపారం చూపించండి.

ఆనం—ఏమంటావ్ ?

రత్నం—నాకు బాగుపడాలనే వుందంటాను. బాగా బ్రత కాలనే, గౌరవంగా గడపాలనే వుంది.

ఆనం—ఒద్దన్న దెవరూ? ఏ కిల్లీకొట్టో పెట్టు - ఈ స్టేషన్ ముందర.

రత్నం—నా దగ్గ రెవ్వరూ కొనరు.

ఆనం—ఏం?

రత్నం—నే దొంగని. నే నేది చేసినా మోసం, ఏది అమ్మినా మోసమే నంటారు.

ఆనం—పోనీ, వుద్యోగం...

రత్నం—దొంగ వెధవకి వుద్యోగం యిచ్చినా, తెలియం గానే తీసేస్తాను.

ఆనం—అవును. నువ్వు దొంగవి. నిన్ను నమ్మకపోవటంలో వాళ్ళ తప్పు లేదు.

రత్నం—అందుకే నే నిట్లా వున్నాను. కాని _ కాని - నే నెందుకు దొంగనయ్యానో తెలుసా ?

ఆనం—ఎందువల్ల ?

రత్నం—మా నాన్న ఇద్దరు దిక్కు లేని పిల్లల్ని చేరదీశాడు.

ఆనం—అదంతా చెప్పాడు.

రత్నం—మిల్లులో ఉద్యోగం చేసి తెచ్చిన జీతం రాళ్ళు చాలేవి కావు. ఒక్కొక్కప్పుడు నాకొక్కడ్డికే అన్నం మిగిలేది. నాన్నకి అసలుండేది కాదు.

ఆనం—అందుకని?

రత్నం—కాలు వచ్చిన కుర్రాణ్ణి - ఊళ్ళో తిరుగుతూంటే నా యీడు పిల్లల చేతుల్లో అనేకం కనిపించేవి. నా చేతులు ఖాళీ. వాళ్ళ చేతుల్లో మిఠాయి పొట్లాలు. నా కడుపులో ఆకలి మోత. మొదటిసారి మిఠాయిపొట్లం కాజేశాను, ఒక చిన్న కుర్రాడు కుక్కలకి పంచి పెడు తుంటే. ఆ కుక్కలతో బాటు నాకూ వక గుప్పెడు పారేస్తే - ఆపని చేసేవాణ్ణి కాదేమో. అప్పుడే పట్టు కుని తన్ని తరిమేశారు. తర్వాత మిల్లు మేనేజరు కొడుకు బేడకాసుతో ఆడుతుంటే కాజేశాను. పట్టుకు చావ గొట్టారు. మా నాన్న వుద్యోగం తీసేశారు. కొడుకు దొంగ వెధవని ఇంటికొచ్చి మా నాన్న చావగొట్టాడు. అప్పుడు నన్నోదార్చిన వాడొక్కడే. మా పెద్ద. దొంగల పెద్ద. నన్ను ఓదార్చి దొంగతనం పద్ధతులు అన్నీ చెప్పాడు. చెప్పినందుకు అతనికి భాగం. తర్వాత తెలి సింది. ఈ పెద్దలింకా చాలామంది వున్నారనీ - ఈ పెద్దల ఆసరా లేకపోతే మా పని మూడు నిమిషాలు సాగదని.

ఆనం—ఊహూ!

రత్నం—ఈ పెద్దల సంగతి అందరికీ తెలుసు. తెల్సినా వాళ్ళ నేమీ అనరు. ఏం చేసినా ఏంతిట్టినా అందరూ మమ్మల్నే! మేం యీ పని మానేద్దాం మనుకున్నా లాభం లేదు. ఈ పెద్ద మమ్మల్ని పట్టిస్తాడు. వద్దనుకున్నా యీ పని చెయ్యాల్సి వచ్చింది.

ఆనం—ఎంత పాపం చేసినా తప్పనిసరియయి చేశానంటాడు ప్రతివాడూ.

ఆనం—ఏమిటది రంగయ్యా?

రంగ—ఏం లేదండీ.

ఆనం—ఏం లేదంటావేం? అంత గాబాగాబా పరుగెత్తుకొచ్చి?

రంగ—(ఆయాసపడ్తూ వాకిలి బయటికి వచ్చి) వాడింట్లోనే వున్నాడండీ. దొంగ గాడిద. వూరెళ్ళానని చెప్పి వెళ్ళలా?

ఆనం—అంతేనా! వూరెళ్ళానని వాడనకుంటునే ఇది వెళ్ళాడని అబద్ధం చెప్పిందా.

రంగ—అది అబద్ధం ఎందుకాడుతుందండీ!...అది!

ఆనం—ఏమో పెళ్ళి చేసుకోలేదని. నీ మీద కోపంగా...

రంగ—ఆ! అయితే యిదే అబద్ధ మాడిందంటారా! ఛీ... ఛీ...నా దగ్గరే కనక, అప్పుడు డబ్బుంటేనా!... డబ్బుంటేనా (తల కటకటాలకేసి కొట్టుకుంటాడు)

ఆనం—రంగయ్యా ఏమిటది (అంటూ దగ్గర కెళతాడు)

—: తెర :—

# మూడవ రంగము

[అదే రంగం. రాత్రి 11 గంటలవేళ. అప్పుడే రైలు బండి వచ్చి వెళ్ళిపోయింది. రైలు దిగిన జనం Plat form స్టేషన్ బయటకువెళ్ళిపోతున్న సంరంభంతో Plat formనిండి వుంది. వెంకటేశ్వర్లు అతని వెనకనే వక యువకుడూ ఆ జనంతో పాటు వక వైపునుంచి ప్రవేశిస్తారు. కాని ఎదురు వస్తున్న మరొక స్త్రీని జూచి ఖంగారుపడి వెనక్కి వెళ్ళి పోతారు. ఆ స్త్రీ అమితమైన ఆదుర్దాతో అందరి మొహాలు పరీక్షగా చూస్తూ వెతుకుతూ స్టేషన్ బయటదాకా వెళ్ళి తిరిగి వస్తుంది. మోహన్ మోహన్ అన్న అక్షరాలు ఆమె వణుకుతున్న పెదవులతో అస్పష్టంగా అంటూ వుంటుంది – ఆమె వెతుకుతూ రెండవ ప్రక్కకు వెళ్తుంది. వెంకటేశ్వర్లు ఆ యువకుడూ ఆమెను తప్పించుకుని బయటకు వెళ్ళిపో బోతారు. ఆమె వాళ్ళిద్దర్నీ చూసి గబగబా పరుగెత్తుకు వచ్చి మోహన్ మోహన్ అని అరుస్తూ యువకుడి కాళ్ళ కడ్డం పడ్తుంది.]

ఆమె—మోహన్......మోహన్...నా జీవితం నాశనం చేస్తావా? నేనేం ద్రోహం చేశాను?...నన్నిట్లా వది లెయ్యటానికి; నిన్నే నమ్మాను; నీ కోసం చదువు చాలిం చాను; నువ్వాజన్మాంతం నాకాసరాగా ఉంటావని నాతల్లి తండ్రుల్ని త్యజించాను; ఎంతైనా చేస్తాను; – మోహన్ దగ్గర నువ్వుంటే చాలు.

వెంక—ఏమిటీ వెధవపీడ.....ప్లాట్ ఫారంమీద.

ఆమె—నీ పాదాలు పట్టుకు ప్రార్థిస్తాను మోహన్; నన్ను నట్టేట నెట్టివేయకు.

వెంక—నీకొక్కదానికా చెప్పేది? - వదులువాణ్ణి...

ఆమె—ఏం చెప్తావ్ మోహన్; నా జీవితాన్నేం చేస్తావు? ప్రమాణం చేసి పాణితోకూడా ప్రాణాన్ని ఫణికి పుచ్చుకున్నావు. నన్నిట్టా నడివీథ కుక్కల్లో వదిలేస్తావా? ఆలోచించు మోహన్?

వెంక—మాట్లాడవేంరా? అదంత వాగుతుంటే...

ఆమె—మాట్లాడు మోహన్ - మాట్లాడు; ప్రమాణాన్ని పాటిస్తావో! - నా భవిష్యత్తు భంగపుచ్చుతావో - ఒక్క మాట - మోహన్... ఒక్క మాట మాట్లాడు.

వెంక—దద్దమ్మ - తెలివి తక్కువ దద్దమ్మ; సిగ్గులేనిదాంతో స్నేహంచేసి...పద. ...

(వెంకటేశ్వర్లు కుర్రాణ్ణి లాగబోతాడు, ఆమె అడ్డంపడి)

ఆమె—వెళ్ళకు - మోహన్ - వెళ్ళకు. మాటల్లో ఎంతో మెత్తని మనస్సు చూపించావ్, మనసు కరుడు గట్టి, కఠిన పాషాణమైపోయిందా? నెత్తిమీద పెట్టుకు పూజిస్తానన్నావ్ - పాదాల దగ్గర పడివుంటాను. పడివుండనిస్తేగాని పాదాలు ఒదలను.

వెంక—వదలవమ్మా గోల......

ఆమె—ఎట్లా వదలను? ఈ జీవితాన్ని పాప కూపంలో కుక్కిపోతుంటే - ఎట్లా...?

వెంక—ఆ...చాల్లే! పీధినపడి అరిచావ్; పదరా - నుంచుం టావ్ నువ్వు గూడా; పద. - దీని అరుపు... అడ్డొస్తా యట.

(లాక్కుపోతాడు; మోహన్ ఆమె మీదగా నాతి వెళ్ళవల్సి వచ్చి అలాగే వెళతాడు)

ఆమె—మోహన్...మోహన్......(దుఃఖిస్తుంది)

[అప్పటికే చుట్టూ అంతా చేరుతారు]

ఆనం—ఏ వూరమ్మా మీది?

రంగ—ఏమిటమ్మా ఈ గోల?

రత్నం—ఏముందీ; నమ్మించి మోసం చేశాడు - పెద్దమనిషి

ఆమె—మోసం చేశాడు, ఖూనీ చేసి గోతిలో పారేస్తే బావుండేది.

ఆనం—ఇట్లా వచ్చి కూర్చో, మీవాళ్ళకి Wire ఇచ్చి పిలి పించమన్నావా?

ఆమె—వద్దు.

ఆనం—మరెట్లా? వంటెరిదానివి - ఇక్కడేం చేద్దామని?

ఆమె—అక్కర్లేదు. నాకు సాయం చేయటానికికూడా... ఎవరూ లేరు.

ఆనం—మీవాళ్లు ఎవ్వరూ లేరా?

ఆమె—ఆయన్ని నమ్మి అందర్నీ విడచివేశాను.

ఆనం—అహా! మరిప్పుడేం చేస్తావ్?

ఆమె—ఏం చేయటాని ఏముంది? పట్నానికి బండి ఎప్పుడో చెప్పండి; వెళ్తాను.

ఆనం—రేపు - పదిగంటలకి.

[కవి, గోపాలం వస్తారు]

గోపా—ఏమిటిది, అందరూ - ఇక్కడ గుంపుగూడారు?

రంగ—పాపం! ఈ అమ్మాయి ఎవరో ఇబ్బందిలో పడ్డది లెండి.

గోపా—ఎవరూ...! (ఇద్దరూ ఆమెను చూశారు)

కవి—ఎవరూ!!... కళా!!

కళ—(చూసి గుర్తించి) ఆ - మీరా!

గోపా—(కవితో) మీరెరుగుదురా ఈమెను!

కవి—ఏమిటిది కళా?

కళ—చేసిన పాపం!

కవి—మోహన్ మోసం చేశాడా?

కళ—ఆ.

కవి.—ఏమిటసలు? ఏంజరిగింది?

కళ—మోహన్ తండ్రి మద్రాసు వచ్చాడు. ఏంచెప్పి - ఏం చేశాడో-మనసువిరచి యింటికి తీసుకువచ్చాడు. స్టేషన్ కి రాంగానే నాకు తెలిసి, ఆబండిలోనే వెంటబడి వచ్చాను. కాళ్ళమీదపడినా, మనసు కరగలే.

కవి—కరగదు..హు. అల్లా అవుతుందని నే నెప్పుడో అనుకున్నాను.

ఆనం—అంతా తర్వాత చూచుకుందాం. నువ్వెళ్ళి కాసేపు పడుకో అమ్మా. రంగయ్యా- వెళ్ళి Waiting Room-ఖాళీ చెయ్యి.

రంగ—ఖాళీగానే ఉంది. రండమ్మా - ఇటురండి.

[రంగయ్య, కళ, Waiting Room వైపు వెళ్ళారు]

గోపా—ఈమెను నువ్వెరుగుదువా?

కవి—ఆ; నాతో కాలేజీలో చదివింది.

గోపా—అయితే మోహన్‌న్ని ఎరుగుదువా?

కవి—ఆ ఎరుగుదును; దుర్మార్గపు వెధవ; అయిదు నెలలు చుట్టూ తిరిగి ఆమెను తనవైపుకి తిప్పుకున్నాడు.

గోపా—అహః!

కవి—అంతకుపూర్వం నాతో ఎంతో ఇదిగా ఉండేది; వాడి మాటలు నమ్మి నాతో మాట్లాడటం మానేశింది.

గోపా—అయితే,......ఈవిడేనా ఏమిటి - నీ మానసంలోని సుందరి?

కవి—ఈమే; ఆనాడు విఫలుణ్ణై కాలేజీ మానేశాను. తిరిగి యీ నాడిల్లా ఈమెను చూశాను.

గోపా—అహః!

ఆనం—పాపం - ముందేం చేస్తుందో?

గోపా—ఏంచేస్తుంది, మళ్ళీ ఏదో చదువుకుంటుంది.

ఆనం—ఎల్లా చదువుతుంది? తల్లిదండ్రుల్ని కూడా వదిలేశిం దట. చదువంటే మాటలా? డబ్బు (కవితో) కవిగారూ మీ పేరేదో మంచిపేరయే వుంటుంది, నిలబెట్టుకోండి.

కవి—ఏమంటారూ?

ఆనం—ఆమె పోరపాటునో-గ్రహపాటునో, బ్రతుకు బ్రద్దలు చేసుకుంది. మీరామె స్నేహితులు. ఆమె ప్రతిరూపాన్ని ఆరాధించుకుంటున్నారనికూడా అన్నారు.

కవి—అయితే...?

ఆనం—అవసరసమయంలో ఆదుకోవాలి. మీరు, ఇదివరకటి 'తప్పిదాన్ని' క్షమించి, ఆమెజీవితాన్ని మంచిమార్గానికి త్రిప్పండి.

కవి—అంటే...?

ఆనం—ఆమె బుద్ధిపూర్వకంగా తప్పుచెయ్యలేదు; మోసం చేయబడ్డది; దోషం సంఘానిదికాని, ఆమెదికాదు; కనక క్షమించటంకూడా తేలిక. కనక...

కవి—కానియ్యండి; రైలుచార్జీలు నేనే యిస్తాను; ఇంటికి వెళ్ళమనండి.

ఆనం—ఆ!

కవి—ఏదో ఎరుగున్నందువల్ల, ఇటువంటి ఖర్చులు తగులుతుంటాయి.

ఆనం—రైలుచార్జీలుకాదు మన సమస్య! ఆమె జీవితమే ఒక సమస్య ఎదురైంది.

కవి—నిజమే ననుకోండి...

ఆనం—అన్నీ ఎరుగున్న మీరు క్షమించకపోతే ఎరగని వాళ్ళేం - చెయ్యగలరు?

కవి—ఏమిటి మీరనేది?

ఆనం—మీరామెను పెళ్ళిచేసుకుంటే బాగుంటుంది. మీరా మెను ప్రేమించారుగూడా!

కవి—నేను ప్రేమించా. కాని భౌతికమైన దేహాన్ని కాదు. నా వ్యూహాల్లో విహరించే రూపసుందరిని వేరు.

ఆనం—ఏమైనా ఆమె పరిస్థితిచూసి జాలిచూపండి.

కవి—జాలి...నా కెందుకండీ, భౌతికాన్ని మించిపోయి, ప్రాపంచికాన్ని మరచిపోయి, వ్యూహాలోకంలో విహరించే దేహమాత్రుణ్ణి. నన్ని భవబంధాల్లోకి మళ్ళీ దింపకండి.

ఆనం—అయితే మీరూ ప్రేమంటే, ప్రాపంచిక విషయమనే భావిస్తున్నారన్న మాట?

కవి—మరి శారీరకమంతా ప్రాపంచికమే.

గోపా—సరే, కానివ్వండి, ఈ వాదన లిప్పుడు తేలవ్. రేపు ఆమెతో గూడా ఆలోచిద్దాం. కాని ఆనందం! నీకు అవసరమైన విషయాలకంటె, అనవసరమైన విష యాలే ముఖ్య మాతున్నాయి. ఆఫీసు పనికూడా ఆపే స్తున్నావ్. పరాయి విషయాలు పట్టించుకునే ముందు, సొంత విషయం కొంత సరిదిద్దుకో - మరి - వస్తాం. రండి కవిగారూ!

కవి—నేనేగా!! వస్తున్నా. (ఇద్దరూ వెళ్తారు)

[ఆనందం నిట్టూర్చి లోపలికి వెళ్ళబోగా రెండో వైపు నించి రంగయ్య వస్తాడు]

ఆనం—ఏం చేస్తుందామె?

రంగ—ఏముంది? ఏడుస్తూ కూర్చుంది.

ఆనం—ఏమన్నా కావాలంటే తెచ్చిపెట్టు.

[దొంగ గబగబా వచ్చి రంగయ్యా! రంగయ్యా! అంటూవచ్చి]

దొంగ—వీరయ్య దాన్ని చావకొడుతున్నాడు.

రంగ—ఆ.

ఆనం—దేన్ని!!

దొంగ—దాన్నేనండీ, సాయంత్రం రంగయ్యని అక్కడ చూశాడంట. ఎందుకొచ్చాడని చావ కొడుతూన్నాడు.

రంగ—వస్తానాగండి.

ఆనం—ఎక్కడికి రంగయ్యా?

రంగ—అక్కడికే!

ఆనం—అడ్డం పోతావా!

రంగ—ఎదురే పోతా.

దొంగ—ఎదురుపోతే అతని అనుమానం, నిజమే అవదూ?

రంగ—మరి నావల్ల తన్నులు తింటుంటే. వూరుకోమంటారా?

దొంగ—వెళ్లొద్దు. రంగయ్యా! కొట్లాటలు ఖూనీల్లోకి దిగుతాయి.

రంగ—అంతేగా, చస్తే, చస్తాను. (వెళతాడు)

ఆనం—ఏమిటీ గోల – ఏమని అడ్డుపోతాడు?

దొంగ—పోడు. తిరిగి వస్తాడు లెండి; మనసు కష్టపడ్డది, అంతే.

ఆనం—ఊఁ; నే పోయి నా పని చూసుకుంటాను.

[కళ వస్తుంది]

కళ—కాసిని మంచినీళ్లు ఇస్తారా ?

ఆనం—ఈపూట భోజనం చేయలేదుగా ?

కళ—లేదు.

దొంగ—దగ్గర్లో కొట్లు మూసేశారు-ఏమన్నా తెద్దామంటే.

ఆనం—ఊళ్ళోకెళ్ళి ఏమన్నా పట్టుకొస్తావా? పోనీ.

కళ—అక్కర లేదండీ.

ఆనం—పర్లా...ఇంద......(డబ్బిస్తాడు. దొంగ వెళ్ళగా కళతో)

ఆనం—మీరా గదిలో వుండండి – ఏమన్నా తెచ్చిపెడ్తాను. (లోపలికి వెళ్ళిపోతాడు)

[కళకూడా వెళ్ళబోతుండగా మోహన్ వస్తాడు]

మోహ—కళా! కళా!

కళ—మోహనా?

మోహ—ఆ; నేనే – చూడూ – చెప్పకుండా పెట్టకుండా అలా వెంటపడి రావటమేనా ?

కళ—ఆ.

మోహ—చదువుకున్న దానివీ, అన్నీ తెలిసిన దానివీ, యిలా బజారునబడి అల్లరి చేస్తే ఏం బాగుంటుంది?

కళ—నే నిన్నల్లరి పెట్టానంటావా?

మోహ—కాదూమరి? మా నాన్న వచ్చి - ఏదో అంటే బయలుదేరి నే నింటికి వచ్చాను. అంత మాత్రాన నిన్ను మర్చిపోతానసే.

కళ—పెళ్ళి చేసుకోటాని కేగా - నువ్వు వచ్చింది?

మోహ—అయితే మాత్రం నిన్ను మర్చిపోతానా? నీ సంగతి నేనేం ఆలోచించ లేదనుకున్నావా?

కళ—అనే అనుకున్నాను. మీ నాన్న వచ్చి, ఇరవై వేల కట్నంతో పెళ్ళి కుదర్చాననటం, నిన్ను రమ్మనటం, నువ్వు మెదలకుండ బయలుదేరి రావటం, అంతవరకే నాకు తెలిసింది. పెళ్ళికి వప్పుకున్నావన్న ఆశ్చర్యంకంటె నన్నొదిలేశావన్న భయం ఎక్కువైంది. నువ్వే చెప్పు! ఎన్నిసార్లు పెళ్ళికి సిద్ధపడి - సాకు జెప్పి, దాటవేశావ్? ఇవ్వాళ నేనంత మొత్తుకుంటుంటే, మెదలకుండా వూరుకున్నావ్!

మోహ—ఊరుకున్నాను, పరిస్థితులల్లా వచ్చాయి. ఏం చెయ్యను ఇరవై వేల కట్నంతో మానాన్న పిల్లను తీసుకొస్తుంటే! ఒకటీ, రెండువేలు గనకా! తోసిపుచ్చటానికి; పైగా ఆ స్త్రీకూడా కలుస్తుందట?

కళ—మోహన్! నా సర్వస్వం తోసిపుచ్చాను - నీ కోసం మర్చిపోయావా?

మోహ—అహాహా! మర్చిపోలే! కాని, నీ సర్వస్వం ఇరవై వేలుంటుందా చెప్పు. కనకే పెళ్ళికి వప్పుకున్నాను.

కళ—అయితే పెళ్లి చేసేసుకుంటావా?

మోహ—ఆ చేసుకుంటా! చేసుకుంటే ఏం? ఇరవై వేలూ వస్తాయి; తర్వాత ఆస్తి వస్తుంది. ఇక నీకూ నాకూ ఏ లోటూ వుండదు. నీకూ వెనక ఏంలేదు. మానాన్నని కాదంటే, నాకూఏంలేదు. కాస్త కళ్ళుమూసు కుంటే యిద్దరికీ వద్దన్నంత ఆస్తివస్తుంది.

కళ—మోహన్...

మోహ—మా నాన్న, ఒక్క నెల డబ్బు పంపకపోతే నాకోసం నువ్వెంత అవస్థపడ్డావో జ్ఞాపకం తెచ్చుకో? ఉన్న వక్క గాజూ అమ్మి – నా జీతం కట్టావ్, జ్ఞాపకం లేదు; ఆరోజు నేనెంత బాధపడ్డాను? అందుకే – ఏ అవస్థా లేకుండా, ఈ పెళ్ళికి వప్పుకున్నాను. పిల్లని చూడనన్నా లేదు; అయినా ఒప్పుకున్నాను. పెళ్ళి అయి నంత మాత్రాన, కళ్లు మూసుకుపోయి నిన్ను మర్చి పోతాననుకున్నావా?

కళ—నన్ను మర్చిపోనంటావా?

మోహ—పై జన్మ సంగతి, నాకు నమ్మకం లేదు; ఈజన్మకి మరచిపోను.

కళ—పెళ్ళయిన తర్వాత మద్రాసు వస్తావా?

మోహ—వెంటనే రానేమోగాని, తొందరగానే వస్తాను. ఒక్క సంవత్సరంకాదు, పది సంవత్సరాలైనా నిన్ను మర్చిపోగలనా, అనవసరంగా హైరానపడ్డావ్ కళా! ఇంత తొంధరగా నిన్నెట్లా మరచిపోగలను

కళ—ఆ మాట వింటుంటే ఎంతో తృప్తిగావుంది మోహన్ ! ఆ మాటే అంటూ వుండు.

మోహ—మాటల్లో ఏముంది, ఇదిగో వందరూపాయలు. చూడూ అయిదారు నెలలవరకూ ఒపికపట్టు; వెంటనే పట్నం పరుగెత్తితే పదిమందీ ఏమన్నా అనుకుంటారు.

కళ—ఈ డబ్బు తీసుకు వెళ్ళమంటారా !

మోహ—ఆ ! లేకపోతే యిప్పుడే యిబ్బంది పడ్తావ్ ! మా నాన్నే చెప్పి యిచ్చి రమ్మన్నాడు; ఆయనెంతో దూరం ఆలోచించే మనిషి. చూడూ ! ప్రొద్దున్నే, బండి వుంది; దానికి వెళ్లు.

కళ—మరి నువ్వో ?

మోహ—నేనూ వస్తాగా ! ఇక్కడ వ్యవహారాలు చక్క బెట్టుకు వస్తాను.

కళ—ఎప్పుడు ?

మోహ—అది నన్నడక్కు. పదిరోజులు కావచ్చు –పది...

కళ—పది సంవత్సరాలు కావచ్చునా ?

మోహ—కళా ! మొండివాదన్లెందుకూ; నామాట విను;

కళ—వినక నేనేం చేస్తాను ? వినకపోతే వద్దు పొమ్మంటావ్. పొమ్మంటే - ఎక్కడికి పోతాను.

మోహ—చూశావా, చూస్తూనే నువ్వు అర్థం చేసుకుంటావ్, కనక ఈ వందా తీసుకెళ్లు.

కళ—వందా తీసుకుంటే నేను జ్ఞాపకముంటానా ? మోహన్ వద్దు. నువ్వెళ్ళు; నువ్వు వచ్చేదాకా నేను వస్తుంటాను.

నీ కోసం నే వస్తుంటానని నీకూ జ్ఞాపకముంటే తప్ప కుండా నువ్వు వస్తావ్.

మోహ—నువ్వు వస్తుంటేగాని జ్ఞాపకముండదంటావా? నీ మీద ప్రేమ లేదంటావా?

కళ—ఆ ప్రేమకు విలువ ఈ వందేగా?

మోహ—అయితే...నామీద నీకు నమ్మకం లేదన్న మాట?

కళ—నమ్మకం సంగతెందుకు? ప్రేమించి నన్ను పెళ్ళిచేసుకోకుండా ఎవర్నో పెళ్ళాడుతున్నావ్; నీమనసుతో నువ్వే 'దోబూచు' లాడుకుంటే, నీమనసును నమ్మేదా? నిన్ను నమ్మేదా?

మోహ—నన్నూ నామనసును, నమ్మకపోతే ఏమౌతుందో ఆలోచించు.

కళ—ఆలోచించాను; ఆలోచించే అంటున్నాను. నువ్వు నన్ను పెళ్ళాడకపోతే, నేను చెడిపోయినదాన్నవుతాను. నువ్వు వదిలేశినా, నేను చెడిపోయినదాన్నే; చెడిపోయిన తర్వాత, వందరూపాయిలు తీసుకుంటే నన్ను నేనే అమ్ముకున్నదాన్నవుతాను. నన్ను చెడిపోయినదాన్నిగానే వుండనీ మోహన్! నేను చేసిన ఉపకారానికి ఈ ఒక్క సహాయం చెయ్యి.

మోహ—అయితే నిన్ను పస్తుపడుకోబెట్టటమా – నే చేసే సహాయం?

కళ—అంతకంటె నువ్వేం చెయ్యలేవు గనక అంతే చెయ్యి; పదిమంది నోటికీ నేను చెడిపోయినదాన్ని. వచ్చిచ్చి – నన్ను [illegible].

మోహ—నాడబ్బుతీసుకోటం నీకవమానమా? నీడబ్బు నేను తీసుకొన్నప్పుడో?

కళ—అప్పుడవసరమై తీసుకొన్నావుగాని......

మోహ—అవసరమైతే, అవమానకరమైన పనిచేసే నీచుణ్ణన్నమాట నేను. నామీద నీకున్న అభిప్రాయం అదేనన్నమాట.

కళ—ఇంతవరకూ కాదు......

మోహ—ఇక ముందు అదా! ఈనోటితోనే నన్నింత పొగిడావ్!

కళ—అదే పొరపాటైంది.

మోహ—అయితే ఇక మళ్ళీ ఆ పొరపాటు చెయ్యకు.

కళ—చెయ్యను మోహన్—చేసిన పొరపాటు దిద్దుకోటానికే ఈ జన్మంతా చాలదు.

మోహ—ఎంత తెగించావ్!

కళ—తెగించాను; నేనెప్పుడు తెగించలేదు? చదువుచాలించేప్పుడు తెగించాను; తల్లిదండ్రుల్ని త్యజించేప్పుడు తెగించాను; నీలాలన బూటకమనీ గ్రహించీ—కళ్ళు మూసుకుపోయి, తెగించాను. ఇప్పుడూ అంతే—ఇక ముందూ అంతే.

మోహ—అనుకో! ఛ—కులటలకంటె నీచంగా మాట్లాడుతున్నావ్.

కళ—ఆమాట నీనోటా, నానోటా వచ్చేదే!

మోహ—కానీ ఆమాటకీ సిద్ధపడితే జరిగిందానికి నేను విచారించను. నేను పొరపాటుపనిచేశానన్న విచారం అక్కర లేదు.

కళ—పొరపాటుచేసి విచారించటం చేతకానిపని;

మోహ—చేతకాని పని చేయటాన్కి సిద్ధంగా లేనులే.

కళ—అది నాకూ తెల్సు - కనకే నిన్నేంచెయ్యమనీ, వేరు పెళ్ళి చేసుకోవద్దనీ అనటంలేదు, నేను.

మోహ—నువ్వాగమన్నా ఆగను. ఆగకపోవటం మంచిదే అయిందని ఆనందిస్తానిక. ఛీ – ఛీ (వెళతాడు)

[ఆనందం ప్రవేశిస్తాడు]

ఆనం—ఏమంటున్నాడు?

కళ—(నవ్వి) ఛీ. ఛీ. అంటున్నాడు, ఇటువంటి "ఛీ-ఛీ"లు యిక ఎన్నో!

ఆనం—డబ్బేదో ఇవ్వబోయినట్టున్నాడు.

కళ—విలువ లేనిదానికి విలువకట్టబోయాడు.

[అరటిపళ్లు తీసుకని దొంగవస్తాడు]

దొంగ—ఇవిగో అరటిపళ్ళు.

కళ—అక్కర్లేదే; అంతా తేలిపోయింది.

దొంగ—ఏమిటీ.

కళ—అంతా చిక్కువిడిపోయింది. ప్రాణాలొక్కటే మిగిలాయి. ప్రాణాలు దక్కించటానికి యిన్ని అరటి పళ్ళెందుకు?

దొంగ—ఏమయిందండీ ?

ఆనం—ఏమయితే ఏం? ఈపళ్లు తీసుకోండి. పొద్దున్నే బండికి...... వెళ్లుదుగాని...

కళ—వెళ్తాను. ఎక్కడికో అక్కడికి వెళ్తాను; వుండి చేసే-దేమిటి ?

ఆనం—అలా అంటారేం – మీవాళ్ళదగ్గరకి........

కళ—మావాళ్ళ దగ్గర కా ?

ఆనం—ఆ! చార్జీలు నేనిస్తాను.

కళ—అక్కర్లే; నాదగ్గర డబ్బుంది; ఇదిగో (డబ్బు తీసి చూపి) దీన్తో జీవించగలను; గౌరవంగా కాకపోయినా బ్రతకగలను. అయినదానికి విచారంలేదు. కాని బ్రతుకంతా బాధపడక తప్పదు.

ఆనం— ఈ అన్యాయానికి వాడికీ బాధతప్పదులే.

దొంగ—వాడికి బాధేమిటండీ ? బాధయితే యిలా ఎందుకు చేస్తాడు!

ఆనం—వుసురుపోసుకు చస్తాడు.

దొంగ—ఎలా చచ్చినా లోకంలో వాడి పరువుకి భంగం లేదు. లోకం వాణ్ణి తెలివిగలవాడిగానే జమకట్టుతుంది.

ఆనం—ఇదీ ఒక తెలివే ?

దొంగ—దీనికే తెలివి కావల్సింది; తెలివి కావల్సింది మంచి పన్లకుకాదు; చెడ్డపన్లకే; రైల్లో మంచి నీళ్ళియ్యటాన్కి తెలివెందుకు? జేబులు కొట్టటాని క్కావాలి,

ఆనం——వెళ్ళి - ఆ గదిలో పడుకో అమ్మా. పళ్ళు తీసుకో, తర్వాత సంగతి తర్వాత ఆలోచిద్దాం.

దొంగ——వేరాలోచన దేనికండి? ఈ పూళ్ళోనే వుంటుంది.

ఆనం——ఆ!

దొంగ——ఆ. ఎక్కడా కాకపోతే మా గూడెంలోనే వుండవచ్చు.

ఆనం——అబ్బే!

దొంగ——మరేం ఫర్వాలేదు.

కళ——(ఆలోచించి) అలాగే వుంటాను. ఇక్కడే వుంటాను, పాప రూపాన్ని కళ్ళకి కనిపిస్తూనే వుంటాను. మీరెవరో నాకు తెలియదు; ఒక యిల్లు చూశిపెట్టండి - ఎక్కడయినా.

దొంగ——ఆ... తెల్లార నివ్వండి - ఇల్లు దొరక్కపోదు.

కళ——సరే వెళ్తాను, ఇవ్వి తీసుకే వెళ్తాను. నేను బ్రతకాలి, ఇవ్వితినాలి, గూడా, (వెళుతుంది)

ఆనం——అల్లా మారి పోయిందేం!

దొంగ——ఆ!

ఆనం——ఆ చీకట్లో నడుస్తుంటే-చూడూ వికృతంగా-భూతంలాగ మారిపోయింది.

దొంగ——అవును.

ఆనం——కళ్ళలో ఎంత కశి కనిపించిందో!

[రంగయ్య వస్తాడు]

ఆనం——ఏమిటది! అలావున్నావే! ఈ రక్తం, ఏమిటి?

దొంగ—వీరయ్య కొట్టాడా నిన్ను. (రంగయ్యవంటిమీద గాయం పరీక్ష చేస్తారు.)

రంగ—లేదు. గోడ దూకుతుంటే గాజుపెంకులు గుచ్చుకున్నాయి. వెధవని రేపే ఖూనీ చేసేస్తాను. పొడిచి చంపేస్తాను.

దొంగ—ఆగు. ముందు ఈ గాయం...

రంగ—తగిల్తే తగిలిందిలే! వెధవ! గొడ్డును బాదినట్టు బాదుతున్నాడు దాన్ని...

దొంగ—ఇంకానా? కొడుతున్నాడా?

రంగ—ఆ! రక్తం వరదలయింది; ఇందరున్నారు ఒక్కగాడిదకొడుకు అడ్డెళ్ళలేదు చూస్తూ; నేవెళ్తే దాన్ని తర్వాత మరీ చంపుతాడని, ఆగాను—రేపు బయటికి రానీ.

ఆనం—చాల్లే—ఆగు. పశువుగా ప్రవర్తించకు.

రంగ—నే పశువు నేనండీ; పశువునే! పశువునుగనుక నే కళ్ళప్పగించి, ఊరుకున్నా. మనిషినయితే మారణం చేసేవాణ్ణి వెధవని—

ఆనం—ఆగు; మాకే భయంపుట్తోంది, నిన్ను చూస్తుంటే; ఆవల్లుకడుక్కురా ముందు.

రంగ—ఆగండి వస్తా.

[ మరొకడు, వొక ఈశ్వర్లు ఎదురౌతాడు ]

వొంక—(హాశ్చలివోయి) ఎవ రతను?

ఆనం—పోర్టర్.

వెంక—ఖూనీ చేయటానికి వెళ్తున్నాడా! చేసివస్తున్నాడా?

ఆనం—ఏం లేదులెండి!

వెంక—హడలిపోయాను; అబ్బ—చీకట్లో రాక్షసుడిలాగ,

ఆనం—రాక్షసుడిలాగే మారిపోయాడు. మనిషి రాక్షసుడుగా మారిపోవటం చాలా తేలిక. మనిషిని రాక్షసుడిగా మార్చటమూ తేలికే; ఇవ్వాళ యిద్దరు రాక్షసుల్ని చూచాను.

వెంక—ఈ అబ్బాయి ఎవరూ? మొన్న......

ఆనం—మొన్న జేబు కొట్టినవాడు.

వెంక—వెధవా! ఏం పన్లురా అవ్వి - వెధవ పన్లు. బుద్ధి కలిగివుంటే పొట్ట గడవకనా?

దొంగ—అందుకేనండీ!

వెంక—అందుకా! మే ముందరం అలా చేశామా? అందుకేట చూడండీ. ఏం తెగించిమాట్లాడుతున్నాడో! వరేయ్, ఈ పన్లు మానితే బతకలేకపోవ్; కావాలంటే నాదగ్గరికి రా - నే చెపుతా అంతేగాని - ఈపాడు పన్లా.

ఆనం—ఈ అర్ధరాత్రి యిలా వచ్చారేం?

వెంక—మీతోనే కాస్త పనుండి; నేనే చెప్తా మనుకుంటే మీరే అడిగారు. ఇందాక మాతో రైలులో వచ్చి గోల చేసిందే ఆవిడ ఏదీ?

ఆనం—మీ కోడలేనా?

వెంక—ఆ, కోడలు! గోడ గడ్డలు!–ఇక్కడే వుందా, ఎక్కడికన్నా వెళ్ళిందా?

ఆనం—అదిగో...ఆ గదిలో వుంది.

వెంక—మీతో ఏమన్నా చెప్పిందా తన సంగతి?

ఆనం—చెప్పింది.

వెంక—చూడండీ మావాడేదో చిన్నతనంలో పొరపాటు పడ్డాడు, కాని ఆడదిల్లాగేనా ప్రవర్తించటం. వెంటపడి గోలచేస్తుందా? వందకాకపోతే రెండువందలు తీసుకో వచ్చు. అంతే గానీ...

ఆనం—ఏమిటూ! మీరే వెళ్ళి మాట్లాడండి.

వెంక—అందుకే వచ్చా. ఎక్కడన్నారూ - యిక్కడేగా!
(వెళతాడు)

ఆనం—రెండు వందలిద్దామని కాబోలు.

దొంగ—అయితే...ఏదో వుంది!

ఆనం—ఏముంటుంది? అల్లరి లేకుండా ఆమెను ఒదలించు కుందామనే అయి వుంటుంది.

దొంగ—లేకపోతే వ్రాళ్ళోపడి గోలచేస్తే, పెళ్ళివారి కిది తెలుస్తుందని కాబోలు. ఆమె లాభం లేదని, తేల్చు కుంది గనక తీసుకుంటుందేమో?

ఆనం—ఏమో చూద్దాం! (రెండో వైపు చూసి) ఎవరా వచ్చేది?

దొంగ—ముకుందంగారు.

ఆనం—పెద్దమనుష్యు లందరూ రాత్రి చీకట్లో ప్రవేశిస్తు న్నారేం?

దొంగ—పెద్ద మనుష్యులు కాదండీ! పగలు బయటపడరు.

[ముకుందం వస్తాడు]

ముకు—మేలుకొనే వున్నారే మాష్టర్ గారూ! వీడితో మాట్లాడుతున్నారేమిటి? రాత్రిపూట.

ఆనం—ఏం; అట్లా అన్నారు?

ముకు—వీణ్ణి మీరెరగరూ! పగలు జేబులు కొడ్తాడండీ!

ఆనం—అందుకనే రాత్రి మాట్లాడుతున్నాను. ఇట్లా వచ్చారేం?

ముకు—అడిగారూ; అనుకుంటూనే వున్నా; మీ వంతెన ఎంతవరకయింది?

ఆనం—ఏం? కట్టించటానికే వచ్చారా ఏం?

ముకు—మనం తల్చుకుంటేనా? హు; కానివ్వండి, మీరే వద్దన్నారుగా!

ఆనం—సరయితే ఎందుకొచ్చారు?

ముకు—వేరేం లేదు; ఒక వందరూపాయిల చిల్లరకావాలి. అర్ధరాత్రి ఎక్కడా దొరకలేదు పూర్ళో - కాస్త శ్రమ అనుకోక యిప్పించాలి.

ఆనం—శ్రమేముంది అల్లాగే యిస్తాను. నోటు తీసుకుని లోపలికి పోబోగా)

దొంగ—నోటు దీపం ముందర జాగ్రత్తగా చూడండి బాబూ - రాత్రిపూట.

ముకు—నోరుముయ్ - దొంగ వెధవ! అందరూ నీకు మల్లేనే అనుకున్నావా?

దొంగ—నాకు మల్లే కాదనుకోండి! మీ పద్ధతి వేరు.

ముకు—ఏడిశావ్! పెద్దా చిన్నా లేకుండా - బడబడా వాగెయ్యటమే ప్రతివాడూ ఈ రోజుల్లో. (ఇద్దరూ లోపలికి వెళతారు)

[రెండో వైపునించి వెంకటేశ్వర్లు వస్తాడు]

వెంక—(రహస్యంగా) ఒరేయ్! మాట! మాష్టరుగారేరీ?

దొంగ—లోపలున్నారు.

వెంక—ఇదిగో - జాగ్రత్తగా విను. ఏభయి రూపాయిలిస్తా ఆమె దగ్గర......

దొంగ—ఆ.

వెంక—ఒక Photo వుంది; అబ్బాయీ, అదీ, తీయించుకున్నది. అది ఎల్లాగన్నా కాజెయ్యాలి?

దొంగ—ఉత్త Photo యేనా?

వెంక—ఉత్త Photo యే! దాని సంగతి నీకు తెలియదులే? యాభై రూపాయలిస్తా - ఆ - అది కాజెయ్!

దొంగ—నేను మీ రిచ్చొచ్చిన రెండువందలూ కాజేద్దామనుకున్నానే?...

వెంక—అదా! వద్దని మొహాన పారేశిందిగా - రూపాయల విలువ తెలుస్తేనా?

దొంగ—Photo యేగా! పోనీ - వుంచుకోనివ్వండి.

వెంక—అలా ఏల్లేదురా, అంటే - తర్వాత చాలా చిక్కులొస్తాయి.

దొంగ—అన్ని చిక్కులొచ్చే పనికి వందా యిస్తారు?

వెంక—వంద కాదు; రెండువందలు; సరేనా? నీ కష్టం నే కనిపెట్టనూ!

దొంగ—Photo భాగ్యానికి దొంగపనెందుకండీ – వెధవపనీ.

వెంక—ఇది దొంగ పనయినా వెధవపని కాదురా – వెర్రి నాగన్న. దొంగిలించేది, Photo; ఉత్త Photo ఆనా కెందుకన్నా పనికివస్తుందీ?

దొంగ—అందుకే రోజూ చూసుకుంటుందీ – వుంచుకో నివ్వండి.

వెంక—ఏడిశావ్ ఊరుకో, ఎంతకావాలో అడగరాదూ? ఇట్లా ఏడిపించకపోతే.

దొంగ—అయితే నాకు కూలీ యిచ్చి దొంగతనం చేయిస్తారన్నమాట.

వెంక—ఆ నీతి నీకు నాకూాట్రా? ఏమిటో కొత్తగా మాట్లాడతావ్?

దొంగ—అయితే కానివ్వండి, రెండువందలు పారెయ్యండి యిట్లా.

వెంక—అల్లా అడుగు. అంతేగాని......

దొంగ—పారెయ్యండి ముందు. (వెంకటేశ్వర్లు డబ్బు ఇస్తాడు)

[ఆనందం, ముకుందం రోపల్నించి వస్తారు]

ఆనం—ఏమిటోయ్ అది?

దొంగ—ఏం లేదు; దొంగతనం చెయ్యటానికి కూలీ యిస్తు న్నారు.

వెంక—ఆ–! ఆ!

దొంగ—ఆమెగారి దగ్గర Photo వుందట; కాజేసి వీరికివ్వా లట?

వెంక—చూశారా! చూశారా!!!

దొంగ—ఇచ్చినందుకు రెండువందలూ యిచ్చారు; వస్తా నండి. రెండువందల రూపాయిలు తీసుకుంటున్నా గానీ యండి Photo మాత్రం – తెచ్చి యివ్వను. (వెళ్తాడు)

వెంక—చూశారా, దొంగవెధవ ఎంత మోసం చేశాడో.

ముకుం—మీదగ్గర రొండొందలు కాజేశాడా, ఏం?

వెంక—అదే పనిచేసిపెడతానని డబ్బుతీసుకుని, మోసం చేశాడు.

ఆనం—అహో, అయితే దొంగతనం చెయ్యని దొంగవెధవ అనండి!

వెం—అంటాం? ఎందుకనను? చూడబోతే మీరూ వాడిపక్ష లాగుందే!

ఆనం—అంటే!

వెంక—అంటేనా! వూరికే ఆ రంకుదానికి గది యిచ్చి చేర దీశారా? ఆమాత్రం లేదనుకున్నారా – లోకజ్ఞానం?

ముకుం—గది ఏమిటి? ఎవరికిచ్చారు?

వెంక—వుందిలే – లోపల వకత్తె.

ఆనం—ఆగండి.

వెంక—ఎందుకాగాలి? నువ్వాగమంటే ఆగుతామా? బజారున పడి ఏకుతాం. (వెళతాడు)

ముకుం—ఏమిటండీ అది?

ఆనం—లోకం నాలికకు అడ్డం లేదాయేం?

ముకుం—లోకంసంగతి, సరే. యీసంగతేమిటి?

ఆనం—అదినాసంగతికాదు. ఆయనగారిసంగతి. వారబ్బాయి గారి సంగతీని.

ముకుం—వారిసంగతి మీకేం పట్టింది? గదిలోసంగతేమిటి?

ఆనం—ఆడదాన్ని అన్యాయంచేసి నడివీధిలోవదలి...పైగా

ముకుం—నడివీధిలోవదిలేడా ఊఁ, వదిత్తే మీగదిలోకెల్లా వచ్చింది?

ఆనం—నేనే ఈరాత్రికి వుండమంటేనూ.....

ముకుం—వుందా? అదాసంగతీ! చెప్పరేం! అహా - ఆసంగతి తెలిస్తే నే నిందాకే వెళ్ళేవాణ్ణిగా?

ఆనం—ఏమంటూరు!!

ముకుం—ఏమంటూలెండి, ఇదేం కొత్తసంగతా! అంతా మామూలే - వస్తా. పానకంలో పుడకలాగ నే నడ్డం ఎందుకు?

ఆనం—ఆగండి.

ముకుం—ఖంగారుపడ్తారెందుకండీ? ఎవరెరగనివీ యీసంగతులూ? వస్తా.

ఆనం—Idiots నోటికొచ్చినట్లల్లా వాగటమే.

[దొంగ వస్తాడు]

దొంగ—ఎవరిమీద - కోప్పడుతున్నారు ?

ఆనం—నీచపు వ్యూహాలుతప్ప మరొకటి రావేం వక్కడి కూడా.

దొంగ—నే నా డబ్బు తీసుకున్నాననాండి! తీసుకుంటే తీసుకున్నాలెండి. మడిగట్టుకు బ్రతకాలనే నియమం నాకులేదు.

ఆనం—అదికాదు; ఆమె ఇక్కడ అయిదు నిమిషాలుందో- లేదో - అప్పుడే అపవాదులు బయలుదేరాయి.

దొంగ—అంతేగా, మామూలే. మరి.

ఆనం—అపవాదులు బయలుదేరటం మామూలే - కాని. కాదని చెప్తున్నా వినిపించుకోడేం! నిజం తెల్సుకోని ఎన్నన్నా ఫర్వాలేదు.

దొంగ—నిజం ఎవరికి కావాలి బాబూ? మీరందంతా పిచ్చిగోల. తాము అనుకునేదానికి - అనుకూలమైతేనే - నిజాన్నైనా, అబద్ధాన్నైనా - నమ్ముతారు. చూడండి, నే దొంగనని అందరికీ తెల్సు. తమ కవసరమయితే దొంగని నమ్ముతారు. అవసరం కాకపోతే - మిమ్మల్నే కాదు, భగవంతుణ్ణికూడా నమ్మరు. మనిషి చెడ్డగానో మంచిగానో అవసరమైతేనే మారతాడు. అడుగో రంగయ్య చూడండి, అవసరమై హంతకుడయ్యాడు.

[రంగయ్య వస్తాడు]

రంగ—హంతకుడేమిటి? రాక్షసుణ్ణవుతాను.

దొంగ—అవుతావనే నేనూ అంటున్నాను.

రంగ—వెధవ - ప్రొద్దున్నే బయటికిరానీ. ఖూనీ చేస్తాను.

ఆనం—ఖూనీ !!

రంగ—ఆ ఖూనీ ఖూనీ చేస్తాను.

ఆనం—తర్వాత నీసంగతి ఏమవుతుందో ఆలోచించు.

రంగ—తర్వాత సంగతేముంది? ఖూనీచేస్తే వురిశిక్ష వేస్తారు. అంతేగా-నాకు వురిశిక్షపడ్డాసరే-దాని కా నరకం తప్పితే చాలు.

[కళ వస్తుంది.]

కళ—ఇక్కడెక్కడన్నా యిల్లు చూస్తావా - అబ్బాయ్.

దొంగ—ఆ! రేప్రొద్దున్న చూశి పెడతాలెండి.

కళ—కాస్త వూరిలోనే చూడు.

దొంగ—అలాగే.

ఆనం—అయితే యీవూళ్ళో వుండటానికే నిశ్చయించారా?

కళ—ఏవూరయితే ఏం - ఇంతకంటె చెడేది లేనప్పుడు.

ఆనం—మరి పొట్ట గడవటమో.

కళ—ఈ మోహన్‌లాంటి వాళ్ళుండగా నాపొట్ట గడవటానికేం.

ఆనం—అంటె...!!

కళ—స్త్రీ ప్రాణంలేని భోగవస్తువుగా భావించే పురుషులున్నంతకాలం తిండికి వెతుక్కో అక్కర్లేదు.

ఆనం—అదేమిటి?

కళ—అలా నా శరీరం యిదివరకే మారి పోయింది. మనసు మార్చుకోటమే మిగిలింది. మనసుతో అవసరం లేని మనుషులు వుంటారుగా.

ఆనం—ఛ ఛ – అదేంపని?

కళ—ప్రపంచం కోరేదే అది.

ఆనం—ప్రపంచం యిది కోరిందా?

కళ—కోరకపోతే చూస్తూ ఎందుకూరుకుంది? కళ్ళముందు అన్యాయం జరుగుతుంటే ఎందుకు తలవంచుకు తప్పించుకుంటుంది? అన్యాయాలతో అణిగిపోయిన అమాయకుల్ని ఎందుకు చూశి పరిహసిస్తుంది?

ఆనం—అయితే ప్రపంచంమీద కోపంతో మనం పాడయిపోతామా?

కళ—ఆ. పూర్తి విశ్వాసంతో. ప్రేమించి పెళ్ళిచేసుకోవటం ఆదర్శం, దాన్నివాళ పాతాళంలోకి తొక్కారు. నేనుకాదు. నేను కాదని అందరికీ తెల్సు, కాని, వాళ్ళ దగ్గరికెళ్ళి పిల్ల నిస్తున్నారు, చితికి పోయిన నాగుండెల మీద అడుగులువేస్తూ, పెళ్ళి కొడుకు పెళ్ళి పందిరి కెళ్తాడు. ఇక నన్ను ప్రపంచం కులటగా, పతితగా, భావిస్తుంది. ఎంత పవిత్రతకోసం భయపడినా నేనిక పతిత నే; పతితగానే – నేను మారిపోతాను. పతితగా జీవితం గడుపుతాను. పతితగా ప్రపంచంమీద కశి తీర్చుకుంటాను.

ఆనం—తొందర పడకు, ఆలోచిద్దాం. ఆ పెళ్ళివారి దగ్గర కెళ్ళి చెప్తే ఉపయోగం వుండొచ్చు.

కళ—చెపితే తెలిసేది - చెప్పకుండా తెలియదా? తెలియ జెప్పి యీ సంబంధం చెడగొడితే, మోహన్ నన్ను మళ్ళీ మోహిస్తాడనా! లాభం లేదు. ఏది చేసినా నారాత యింతే.

ఆనం—హు! ఒకడు దొంగతనానికి, వకడు హత్యకి. వకరు వ్యభిచారానికీ దిగారు.

దొంగ—మరి దానికి కారణం ఎవరంటారు.

ఆనం—అదే - ఇంకా నిశ్చయం కాలేదు. ప్రపంచంతో, ప్రజలతో, పరిస్థితులతో, మనం పోట్లాడక తప్పదు. కాని ఆ పోట్లాటలో మనం మారి పోవాలాఅని మనం మారిపోకుండా పవిత్రంగానే పోట్లాడలేమా!...అదే ఆలోచించాలి.

దొంగ—బండి వచ్చే Time అయినట్టుంది. మనుష్యులు వస్తున్నారు.

ఆనం—ఆ ఒంటిగంటైంది. రంగయ్యా Light వెలిగించు పో.

[రంగయ్య వెళ్తుండగా శ్రీధరం మరికొందరు వస్తారు]

శ్రీధర—రండి - ఇల్లా నుంచోండి - వరసగా. అందరూ వచ్చారా ఇరవై అయిదు మందీ? ఏదీ - (లెక్క- లేసి వచ్చి) ఆ సరే అందరికీ జ్ఞాపక ముందిగా నే చెప్పిందీ-ఆ అందరూ బోర్డులు తెచ్చుకున్నారా? ఆ రైలురాంగానే అందరూ గొంతెత్తి అరవాలి; ఏమని? ఆకలి...

అందరు—''అవుతోంది'' (అని అరుస్తారు)

శ్రీధర—అన్నమూ...
అందరు—కావాలి.
ఆనం—ఏమిటండీ యిది?
శ్రీధర—ఆందోళనండీ ఆందోళన. ఈ బండిలో యిటు Minister గారొస్తున్నారు; ఆ, వచ్చిపోయారు. గట్టిగా అరవాలి సుమా? మంత్రిగారు నిద్రపోతుంటారు. ఏదీ - ఆకలీ...
అందరు—అవుతోంది.
శ్రీధర—అన్నమూ...
అందరు—కావాలి.
శ్రీధర—స్వతంత్ర భారత్ కూ
అందరు—జై.
శ్రీధర—గాంధీ మహాత్మాకూ
అందరు—జై.
శ్రీధర—ఆకలీ...
అందరు—అవుతోంది.
శ్రీధర—ఆ. పద...అందరూ వరసగా కూర్చోండి. (అంటూ వక బుట్టతీసి - అందరకీ పకోడీలు పంచిపెడ్తూ) తినండి. కావల్సినన్ని తినండి తర్వాత అరవటానికి ఓపిక వుండాలి...ఆ. ఆ. వరసగా కూర్చోవాలి. (అందరకీ పకోడీలు పంచి పెడ్తుండగా)

—: తెర :—

# నాల్గవ రంగము

[ఉదయం - 10 గం॥ వేళ రంగయ్య వక్కడే వున్నాడు. ముకుందం గోపాలం వస్తారు]

గోపా—ఆనందం ఏడోయ్ - రంగయ్యా ?

రంగ—ఆనందంగారాండీ, !- అక్కడున్నారు. (తెరలోకి చూపిస్తాడు)

గోపా—ఏం చేస్తున్నాడక్కడ ?

రంగ—వంతెనకి - సిమెంటు యిటుకలు తీస్తున్నారు.

గోపా—సిమెంటు యిటుకలు పోయిస్తున్నాడా !

రంగ—పోయించట మేమిటి ? తనే తీస్తున్నారు.

గోపా—తనా !! సొంతంగా - !!

రంగ—ఇంకా ఇద్దరు కుర్రాళ్ళతో కలిసేలెండి.

**ముకు**—సొంతంగానే ! స్టేషన్ వదిలివెళ్ళి యిటికెలు తీస్తున్నారూ ?

రంగ—రాత్రి మాగూడెం వాళ్ళం యిసక తోలేంలెండి.

ముకు—అయితే ఇకేం ! వంతెన తయారయిందన్న మాటే- ఊరివాళ్ళతో నిమిత్త లేకుండా.

గోపా—మొత్తానికి బలే పట్టుదల మనిషి.

ముకు—పట్టుదలే ! ఇంకా ఎదురు దెబ్బలు తగలలేదుగనక ! నాల్గు ఎదురు దెబ్బలు తగిల్తేగాని, పట్టుదల వదలదు.

గోపా—ఏమట్లా అంటున్నారు ?

ముకు—ఏముందీ? వూళ్ళో నల్గురూ నాల్గు రకాలుగా అంటు న్నారప్పుడే!

గోపా—ఏమంటున్నారు?

ముకు—ఇటు వంతెన విషయం. అటు ఆ అమ్మాయి విషయం! పైన ఇల్లా ఆఫీసుపని మాని పై పని పెట్టుకు కూర్చోవటం, వెంకటేశ్వర్లు గారబ్బాయి పెళ్ళి పీటల మీాద చెడగొట్టటం.

గోపా—ఆ! ఆ! పెళ్ళివారితో మాట్లాడేట్ట...

ముకు—మాట్లాడేట్ట. ఆ పెళ్ళి పీటలమీాద ఆగింది - వెంక టేశ్వర్లుగారు వూళ్ళో గోలచేస్తున్నాడు.

గోపా—అహా! అతను ఆఫీసుపని ఎప్పుడు మానేశాడం టూరూ?

ముకు—ఇదిగో ఇప్పుడు మానలేదూ? అన్నీ రిపోర్టులు వెళ్తున్నాయిలెండి. వెధవలతో చేరి నాటకమాడితే మంచి పేరు వస్తుందటండీ - ఎన్ని వంతెనలు కట్టిస్తే మాత్రం?

గోపా—పేరు సంపాదించాలనే ప్రయత్నం కనిపించదు.

ముకు—మరి యిదంతా ఎందుకనుకున్నారు? నాకు తెలి యదూ ఈ నాటకం?

[శ్రీధరుడు ప్రవేశిస్తాడు తొందరగా]

శ్రీధర—ఏరీ మాష్టర్ గారూ?

గోపా—ఏమండీ - ఏం?

శ్రీధ—ఏం, ఏమిటండీ ఏం ? "మంచి, మంచి" అని కబు
ర్లూనూ! చేసేవి ఈ గూడుపుఠానీలూనా.

గోపా—ఏం చేసేడు ?

శ్రీధ—ఏం చెయ్యాలి ? రెండువందల రూపాయలు పోసి మావాడు స్టేషన్‌కి కిల్లీకొట్టు కంట్రాక్టు తీసుకుంటే ఆ దొంగకుఱ్ఱాడిచేత, స్టేషన్ బయట కొట్టు పెట్టించాడు – మా వాడికి ఎంత నష్టం ?

రంగ—మీావాడు కంట్రాక్టు చేశాడుగాని కొట్టింకా పెట్ట లేదుగా !

శ్రీధ—కొట్టు పెట్టకపోతే ఏం ? పెట్టిం తర్వాత నష్టమేగా !

రంగ—మూడు నెల్లయింది మీావాడు కొట్టు కంట్రాక్టుపాడి, ఇంతవరకూ కొట్టు పెట్టలేదు. స్టేషన్‌లో కొట్టు లేకపోతే జనానికేగా యిబ్బంది !

శ్రీధ—జనం యిబ్బంది పడితే పడతారు. మధ్య ఈయనకేం? పురెక్కించి దొంగవెధవచేత కొట్టు పెట్టిస్తాడూ ? ఫూరికే పోదులెండి అన్ని రిపోర్టులూ పోతున్నాయి !

గోపా—రిపోర్టు చేశారా మీారు ?

శ్రీధ—నేనేమిటి ? వూళ్ళో వున్న రెండు పార్టీలు కూడా చేశాయి.

ముకు—చెయ్యరూ మరి ? వెంకటేశ్వర్లుగారు అర్జీ వ్రాశా రుట ఆ అమ్మాయి సంగతి.

శ్రీధ—అదీ – సొంతగా రాళ్ళు దీస్తున్నారని కూడా రాశారట

ముకు—అది వ్రాసింది మీ పార్టీవాళ్ళు గాబోలు.

శ్రీధర—కాదు. మీంపార్టీవాళ్లేట.

ముకుం—కాదు. ఆసంగతి నాకిప్పుడే తెలిశిందసలు. మీంపార్టీ వాళ్ళే -వంతెనకోసం, చంఘాలుకోసం బీదప్రజల్ని పీడిస్తున్నాడనీ సొంతంగా రాళ్లు దీయిస్తున్నారని రాశార్ట.

శ్రీధర—ఆ, అది నీకెల్లా తెలిసింది?

ముకుం—తెలియక ఏంచేస్తుంది?

[వెంక ఉేశ్వర్లుగా రొస్తారు కోపంగా]

వెంక—ఏడండీ యీమాష్టరు ఏడీ? (Booking లోకి వెళ్ళబోతాడు)

గోపా—అదేమిటి! అంత ధూకుడుగావచ్చారు!

వెంక—ఉత్త దూకుడు కాదు-దవడ పేలగొట్టటానికి వచ్చాను.

గోపా—ఏం?

వెంక—ఏమంటావేమిట య్యా! ఇన్నేళ్ళొచ్చీ - శాస్త్ర బుద్ధి చెప్పలేవు? స్నేహమంటూ 24 గంటలూ యిక్కడే వుంటావ్.

గోపా—ఏంచేశాడేం?

వెంక—ఏం చెయ్యాలి? పీటలమీాది పెళ్ళిపాడుచేశాడు, ఆ Photo చూపించి.

గోపా—పెళ్ళాగిపోయిందా?

వెంక—ఆగిపోదూ-ఇటువంటి అల్లరిచిల్లరివాళ్ళు అడ్డంపడితే! మీాకేదో పెద్దమనుష్యులు కనక చెప్తున్నాను. మీారు

మందలించి ఆ Photo యిల్లాపాకేయించండి లేకపోతే ఎంత చెయ్యగలనో అంతాచేసి చూపిస్తాను. ఏమను కున్నారో.

ముకుం—అవిషయం వారివల్ల కాదులెండీ.

గోపా—నావల్ల కానిమాట నిజమే.

ముకుం—దాని విషయం కావాలంటే నన్నడుగు; నేను చెప్తాను.

వెంక—కానీ - నువ్వేకానీ, వెధవఫొటో వక్కటిపట్టుకొచ్చి పదివేల రూ॥ల సంబంధం పాడుచేశాడు. ఆ అమ్మాయిని ఇక్కడే కాపరంపెట్టారటగా! కాపురంపెట్టి మమ్మల్ని అల్లరిచేసి కక్షసాధించాలనేగా? మేం కక్షకట్టటం చేత కాక వూరుకోలే. పది రూ॥లు పారేశి ప్రాణాలు తీయించ గలను. జాగ్రత్తగా వుండమనండి.

ముకుం—(నవ్వి) అంతకోపం బయటకు చూపించటం పనికి రాదండీ వెంకటేశ్వర్లుగారూ! మీరిట్లా రండి.

వెంక—నే రాను. ఈ Photo చేజిక్కందే రాను.

ముకుం—ఫొటో వచ్చేపద్ధతి నేచెప్తాగా. రండి. ఇట్లా రండొ క్కసారి. (ఇద్దరూకలిసి ఒకపక్కకి పోతారు.)

[రత్నం పరుగెత్తుకొచ్చి]

రత్నం—రంగయ్యా! నువ్వీక్కడే వున్నావా?

రంగ— ఏం?

రత్నం—బాబుగారేరీ?

రంగ—అక్కడున్నారు. ఎందుకూ?

రత్నం—ఏంలే.

రంగ—బాబుగారెందుకూ?

రత్నం—వీరయ్యా-భార్యని కొడుతుంటే తనకిచెప్పమన్నారు.

రంగ—కొడుతున్నాడామళ్ళా! - ఆగు - (వెళ్ళబోగా)

రత్నం—వెళ్తున్నావా అక్కడికి! ఆగు! బాబుగారెళ్ళి మాట్లాడతా నన్నారు.

రంగ—అక్కర్లే. నేనే కనుక్కుంటా. సంగతేదో తేల్చేస్తాను (వెళతాడు)

గోపా—ఏమిటది ?

రత్నం—ఏమిటోగోల! బాబుగారు ఏదో బాగుచేద్దామనుకున్నారు. వీడు వెళ్ళి పాడుచేస్తాడు. ఆగండి. బాబుగారితో చెప్పొస్తాను. (రెండోవైపుకి వెళ్తాడు)

[ముకుందం ప్రవేశం]

ముకుం—ఆయన్ని పంపించి వచ్చానండీ ఎల్లాగయితే ఏమిటో కోపంలోవళ్ళు మర్చిపోవటమేగాని ఒకక్కడికి తలకాయ పని చేయదు. దీంతో ఆయనపని ఖాళీలెండి. ఇక మనం ఎంత చెపితే అంత.

శ్రీధర—ఆ - ఆ - అట్లాగేగా నువ్వు తలకాయలు మార్చేది! నీసంగతి నాకు తెలియదటలే.

ముకుం—ఆ. నీతలకాయ వక్కటే - ఏంచేసినా మారకుండా వుంది - దాన్లో ఏముందోగాని.

[కళ వస్తుంది]

కళ—(ఒక చందాడబ్బాతో) వూరికి వంతెన కట్టిస్తున్నామండీ, చందా వేస్తారా. (అని అవతలకూర్చున్న వేరే పెద్దమనిషిని అడుగుతుంది.)

ముకు—(ఆమెను చూచి) ఆ అమ్మాయేగా!

గోపా—ఆ...ఆమే (కళ ముకుందం దగ్గరకొచ్చి)

కళ—ఊరికి వంతెన కట్టిస్తున్నామండీ మీకు తోచిన చందా వేయండి.

ముకు—వంతెన చాలా అవసరమే, మన అందరికీ! ఆ... ఇదిగో, నా చందా (అయిదు రూపాయలు తీసివేస్తాడు.)

శ్రీధర—ఓశ్! వెధవ అయిదేనా! ఇల్లా అయిదుల్తో ఏమవుతుందమ్మా? చందాపట్టీ వుందా? ఉంటే ఇలాయియ్యి—నేను రెండు వందలేస్తాను.

ముకు—ఆ! వేస్తాడు కాగితంమీద.

శ్రీధర—నువ్వేశావులే...నుహా! అయిదు రూపాయిలు - డబ్బాలో.

ముకు—వెయ్యలేక కాదు. వేలు వెయ్యగలను - వేయించాగలను. ఆడది అడిగిందిగనక ఆనక రమ్మనకుండా జేబులో వున్నది వేస్తున్నా...

శ్రీధర—ఉన్నది వేస్తున్నావేం? నే నింటికెళ్ళివచ్చి వున్నదంతా వేస్తా చూడు. ఇక్కడే వుంటావ్ గదమ్మాయ్. నే నిప్పుడే - ఇప్పుడే వస్తా. ఎక్కడికీ వెళ్ళకు.

[గబాగబా వెళ్తాడు కళ అందర్నీ అడుగుతూ రెండో వైపుకి వెళ్తుంది]

ముకు—ఈ పద్ధతీ బాగానే వుంది.

గోపా—ఏదీ ?

ముకు—ఆయనగారెవర్నీ అడక్కుండా, ఆడదానిచేత అడిగించటం!

గోపా—ఆయనే అడిగిస్తున్నాడంటూరా?

ముకు—మరి ఆడది అడిగిందనగానే చూడండీ – పట్టుకు రావటాన్కి పరుగెత్తాడీ పెద్దమనిషి.

గోపా—మరే! ఇదివరకూ కట్టిస్తే తనే కట్టించాలిగాని చందా వేయించ నన్నాడు?

ముకు—తను కట్టించటం సంగతి అప్పుడే మర్చిపోయినట్టున్నాడు.

[కవి ప్రవేశించి]

కవి—గోపాలం గారూ ?

గోపా—నువ్వా! ప్రొద్దున్నే వచ్చావేం! ఎప్పొచ్చావ్?

కవి—రావటం పొద్దున బండికే వచ్చాను. మీ ఇంటికి వెళ్ళి, మీరు లేకపోతే, వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చాను.

గోపా—ఏం విశేషం ? అల్లా వున్నావేం ?

కవి—ఉన్నాను – వేరే విధంగా వుండలేక – చూడండీ మన బ్రతుకు మనం బ్రతుకుతున్నా చూసి ఓర్వ లేరండీ ఈ బంధుమిత్రులు.

గోపా—ఆ!!

కవి—అంటే మీసంగతి కాదు గానీ...

గోపా—మరి ?

కవి—నిన్నరాత్రిఇంటికి వెళ్ళేసరికి ఒక పెనుతుఫాను వీచింది. ఫెళ ఫెళా నా రెక్కలు విరిచింది. మండు వేసగిలో ఎండి పోయిన తటాకంలాగ, బావురుమంది నా భావి బ్రతుకు.

గోపా—ఎంత వేసంగయినా ఇంత అన్యాయమా ?

కవి—అన్యాయ మేమిటండీ – కన్నతల్లికే కవి పుత్రుడిమీద కాఠిన్యం ఆవహిల్లితే !

గోపా—అదేమిటి ? కొత్త సంగతి చెప్తున్నావ్ !

కవి—ఏం లేదు. మా అమ్మకు నా జీవితం రుచించలేదు. వుద్యోగ మేదన్నా చూచుకుని చేరతావో ? ఇంట్లోంచి నడిచి వెళ్తావో?– ఆలోచించుకురా–అన్నం పెడతానంది.

గోపా—అవును మరి. ఎన్నాళ్ళని ఇట్లా వూరికే వుంటావ్ !

కవి—ఆ! ఎన్నాళ్ళంటారా మీరు కూడా! తప్త హృదయాన్ని చల్లార్చుతారను కున్నాను గాని...

గోపా—అబ్బాయ్ ! కడుపు నిండిన తర్వాత – యీ కవితా కన్యల సంగతీ కొంగల సంగతీ విచారిద్దాం. ముందు వుద్యోగం ఏదన్నా చూసుకో. కడుపులో ఆకలిముఖంలో కనిపిస్తుంది. తొందరగా పద భోజనం చేద్దాం.

ముకు—వెళ్తారా. ఏం ? మీతో ఒక విషయం మాట్లాడాలి ఒకసారి యిలారండి.

గోపా—ఇప్పుడే వస్తాను. కూర్చోవయ్యా.

[అని కవితో అని ఇద్దరూ ఒక ప్రక్కకి వెళ్తారు. కవి కూర్చుంటాడు కళ Waiting Room వైపునుంచి వస్తుంది. కళను చూసి కవి గుర్తించి రెండవ ప్రక్కకు తిరిగి తలవంచు కూర్చుంటాడు. కళ కవి దగ్గరకొచ్చి-]

కళ—పంటకాలవకి వంతెన కట్టిస్తున్నాం - చందా వేస్తారా!
(కవితల ఎత్తగా కళ అతన్ని గుర్తించి) ఓ! మీరా!!

కవి—నాతో వేళాకోళం ఆడుతున్నావా కళా!

కళ—ఏం అలా అన్నారు?

కవి—నా జీవితంతో వేళాకోళం ఆడడం మామూలేగా నీకు! అందుకన్నాను.

కళ—నే నెప్పుడు వేళాకోళం చేశాను - మిమ్మల్ని ?

కవి—ఎప్పుడూనూ. మొదట మోహన్‌తో స్నేహంచేసి నన్ను వేళాకోళం చేశావ్. అతన్ని ప్రేమించి నన్ను వేళాకోళం చేశావ్. అతన్ని విడనాడి యీనాడూ నన్ను వేళాకోళమే చేస్తున్నావ్ - నా దగ్గర దమ్మిడీ లేదని తెలిసీ చందా అడగటం వేళాకోళం కాదూ.

కళ—ఏం ? అంత కష్టంగా మాట్లాడుతున్నారు.

కవి—నేనొక రెక్కలులేని పక్షిననీ- మా అమ్మ నన్నింట్లో నించి వెళ్ళగొట్టినదనీ నీకు తెలియదూ ?

కళ—నాకేం తెలుసూ ? - ఏం పాపం ?

కవి—వుద్యోగంలో చేరాలట. జీవితాన్ని సదా లలితభావాలతో లాలించటాన్కి బదులు ఏ ఆఫీసు కాగితాల్లోనో అణిగిపోవాలట.

కళ—అదా...ఒక...పనిచెయ్యండి.

కవి—ఏమిటది ?

కళ—మా ఇంటికి రండి.

కవి—ఆ, నీ దగ్గరుండమంటావా!

కళ—ఆ! ఉంటారా.

కవి—వుంటాను.

కళ—కాని నా దగ్గరుంటే ప్రపంచం మిమ్మల్నేమంటారో – ఆలోచించుకోండి.

కవి—ఫర్వాలేదు. అనుదిన జీవితం నాకు సమస్య కాకుండా కవిత్వానికి జీవితం కైంకర్యం అయితే చాలు. ఈ ప్రపంచానికీ ఈ జీవితానికీ సంబంధం లేదు.

[శ్రీధరం వస్తాడు]

శ్రీధ—ఇదిగో అమ్మాయీ 200 రూ॥లు. రేపు మా యింటికి రా! మరో 200లు ఇస్తాను.

కళ—రెండువందల రూపాయిలా!!

శ్రీధ—ఆ...అనాకళలెక్కా! మనం తెల్సుకుంటే అసలు వంతెనే – నా పేరన కట్టించమా? – ఆ – చూడూ, ఈ చీటీ చూసుకో నా సంగతి తెలుస్తుంది.

కళ—ఇదేమిటి!

శ్రీధ—చూసుకో, తెలుస్తుంది.

కళ—(చదువుకొని) నా జీవితాన్నిగూర్చి చాలా తెల్సుకున్నారే!!

శ్రీధ—అదా! ఊళ్ళో అందరికీ తెల్సింది. నాకూ తెలిసి జాలేసి

కళ—మీజాలి నాకే మక్కరలేదు. ఏ మనుష్యుడూ జాలి పడకూడనంత పాపకూపంలో ఈ జీవితం పడిపోతుంటే ఆనందంగారు రక్షించారు. నాకు మీ సహాయమేమీ అక్కర్లే.

శ్రీధ—అలా అనకు! నీ బోటి తెలివైన యువతులు మా బోటివారి మాట వింటే ఎంతైనా రాణిస్తారు. నీకెందుకూ? వచ్చే ఎలక్షనులో నిన్నూ పంచాయతీబోర్డు మెంబరు చేయిస్తా - ముందుగా మా స్కూలులో పంతులమ్మగా చేరు. తర్వాత - ఈ గల్లంతంతా తీరిన తర్వాత......

కళ—క్షమించండి. (చీటీ చింపేస్తుంది)

శ్రీధ—తొందరపడకు. రేపు కల్సుకుందాం. లేదా మా యింటి కొకసారి సాయంకాలం వచ్చినాసరే - నేవస్తా మరి - ఆ... (వెళతాడు)

కవి—ఏమంటాడు - ఆ చీటీలో?

కళ—వుద్యోగం యిస్తాట్ట. ఆదరిస్తాట్ట.

కవి—మంచి పనిచేశావ్.

కళ—మంచిగానే వుండాలని నా ప్రయత్నం. జీవితంలో పోట్లాటలో మారిపోకుండా వుండాలనే ప్రయత్నిస్తాను.

కవి—నాకు తెలుసు కళా - ఏదో కారణాంతరాలవల్ల కాల వాహినిలో కొట్టుకుపోయినా చివరికి మన తొలివలపే నిలిచివుంటుంది.

కళ—ఏమంటారూ ?

కవి—నాకు తెలుసు - కామం వేరు - హృదయంలోని మధురమైన ప్రేమ వేరు. ఎంత ప్రేమ లేకపోతే తిరిగి నాకు ఆశ్రయమిస్తావ్.

కళ—ఆగండి! అల్లాగయితే నాయింటికి రానక్కరలేదు. కావాలంటే తిండిపెట్టగలను. అంతే మీరుకోరగలిగింది.

కవి—అదే నేననేదీ-అపార్థంచేసుకోకు కళా; ప్రేమను శారీరకంగా నేను చూడటంలేదు. వెళ్దామా మరి?

కళ—ఆ - (ఇద్దరూ వెళ్ళబోతుండగా గోపాలం ముకుందం వస్తారు)

గోపా—నీకోసమే వస్తున్నాం అమ్మాయ్ - వక్కమాట.

కళ—ఆ......

గోపా—చూడూ-నీదగ్గర నువ్వూ మోహన్ తీయించుకున్న Photo వుందటగా.

కళ—ఉంది - ఉంటే...?

ముకుం—ఉందని వెంకటేశ్వర్లే అన్నాడు - అదేనా? ఇంకేమన్నా వుత్తరాలుకూడా వున్నాయా?

కళ—ఉన్నాయి.

ముకుం.—అయితే ఇకేం? కావల్సినంత గ్రంథం నడిపించవచ్చు.

గోపా—అవ్వి ఒకసారి తెస్తే, ముకుందంగారొక్కసారి చూసి, కోర్టులో కావల్సినంత గ్రంథం నడిపిస్తారుట.

ముకుం——నువ్వా అవ్విగనక బయటపెట్టి నోటీసుయిస్తే చాలమ్మా. అయిదువేలిచ్చి రాజీకివస్తాడు. నువ్వేం సందేహించకమ్మాయ్. ప్లీడర్ ఫీజులు వగైరా వకటి రొండొందలు – అయితే అవుతాయి. ఆసంగతి నాకొదిలెయ్యి. తర్వాత మనం మనం చూచుకుందాం.

కళ——నాబ్రతుకు కోర్టుపాలుచేసుకోనా!!

ముకుం——ఆ అనుమానమే వద్దు. ఇంతవరకూ రానేవచ్చింది. అవ్వితెచ్చి నాచేతిలోపెట్టు. వెంకటేశ్వర్లు నాకాళ్ళదగ్గర కొస్తాడు. ఈవిషయంలో మనం కత్తుగట్టి సాధించాలి గానీ – వూరికే వదిలెయ్యగూడదు.

కళ——సాధించాలా!!

ముకుం——ఆ! నిన్నుచేసిన అన్యాయాన్కి నువ్వుగనక వూరుకున్నావ్‌గాని – మరొకరయితేనా?

కళ——కానివ్వండి. తెచ్చియిస్తాను. ఇక్కడే వుండండి.

[ఆనందం ఎదురౌతాడు]

ఆనం——ఏమిటది తెచ్చి యిస్తానంటున్నావ్.

గోపా——ఆ అమ్మాయిదగ్గరేదో Photo వుందట – వాటితో మోహన్‌రావును కోర్టుకు లాగాలనీ...

ముకుం——నెత్తకి – అయిదువేలకి చిలుంవదులుతుంది.

ఆనం——అయితే అయిదువేలకి అమ్ముడుపోతావా కళా. అమ్ముడుపోయేదానికంటే అన్యాయమై పోవటం మంచిదేమో.

ముకుం—మంచిదని ఊరుకుంటే అన్యాయానికి అడ్డమే లేకుండా పోతుందిగా! ఊరుకుంటే మోహన్‌కి వచ్చిన నష్టమో లేదు - మనకి లాభంలేదు!

ఆనం—మనకు లాభంలేదూ?

కళ—(కోపంతో) లేదు. స్త్రీ జీవితం నాశనంచేయటాన్కి వెనుతియ్యని ఈలోకంలో వూరుకుంటే నాకేం లాభం? కక్షసాధిస్తాను. సాధించితీరతాను.

ఆనం—ఆలోచించు కళా. నీజీవితం సరిదిద్దుకోవటం నీకర్తవ్యమా? కక్ష సాధించటం కర్తవ్యమా?

కళ—నా జీవితాన్ని సరిదిద్దుకోటమే. కాని వానికి మార్గం లేనప్పుడూ?

ఆనం—మార్గంసంగతి తర్వాత ఆలోచిద్దాం. కర్తవ్యం ముందు నిర్దేశిద్దాం! జీవితాన్ని పవిత్రంగా నడిపిద్దామా? కక్షలకోసం జీవితాన్ని బలిపెడదామా? స్వర్గానికి తోవ దుర్మార్గమయితే నాకు స్వర్గం అక్కర్లేదు.

కళ—నాకూ అక్కర్లేదు.

ఆనం—అయితేకాని. మన కర్తవ్యాన్ని సన్మార్గంలోనే సాధిద్దాం. మోహన్‌ను మనం కోర్టులో సాధించనక్కర. మోహన్ మనస్సునే - సాధిద్దాం.

కళ—(ఆలోచించి) అలాగే! మీరేం చెయ్యమంటే అదే చేస్తాను. నాజీవితం బాగుపడితే సరి. ఇదేకాలు. ఇటనో వంతెనకు నే వసూలుచేసిన చందా - 215 రూపాలు.

ఆనం—చందా ఏమిటి?

కళ—మీరు పడుతూన్న శ్రమచూచి నేనూ చేయగలిగింది చేద్దామని చందాలు వసూలు చేశాను.

ఆనం—బాగా వసూలు అయిందే! ఎవ రెవ రిచ్చారు.

కళ—రెండువందలు శ్రీధరంగారనే వారిచ్చారు. అయిదు వీరిచ్చారు (ముకుందాన్ని, చూపిస్తుంది) తతిమాది తలా ఒకటీ యిచ్చారు.

ఆనం—ఊఁ (ఆలోచించి) ఈ రెండొందల అయిదూ ఎవరివి వారి కిచ్చెయ్యి. తతిమాది వుంచు.

కళ—ఏం?

ఆనం—వీరు వంతెన కోసమయితే ఇచ్చేవారు కారు. నువ్వడిగావ్ కనక యిచ్చారు.

ముకు—ఎవరడిగినా వినియోగం వంతెన కేగా.

ఆనం—వంతెన కే...

ముకు—వంతెన కట్టించడం మంచిపనేగా.

ఆనం—అవును.

ముకు—అయితే ఆవిడ అడిగిందీ - మేం యిచ్చాం. తప్పేముంది?

ఆనం—తెప్పు కనిపించటం లేదా? నే చెప్తా, వినండి. ఒక నాడు మిమ్మల్ని చందా వేయమన్నాను. ఆ వేళ మీకు స్వలాభం కనిపించక సాకు చెప్పి తప్పించుకున్నారు. ఇవ్వేళ ఈవిడ అడిగింది. మీకు స్వార్థమేదో కనిపించింది,

చందా వేశాను. మీరు చందా వేశింది నందెనకి కాదు - ఈమె అడిగిందిగనక.

ముకు—అప్పు డిష్టంలేకపోయింది. ఇప్పుడిష్టమయింది. అప్పు డిచ్చినా యిప్పుడిచ్చినా డబ్బేగా?

ఆనం—డబ్బే! కాని ఆ డబ్బు యిచ్చే వుద్దేశ్య మంచిదయి వుండాలి. అప్పుడేగాని ఆడబ్బు మంచిదిగాదు - నే తీసు కోవటమూ మంచిదికాదు. తిరిగి తీసుకోండి - మీఅయిదు రూపాయలు.

ముకు—అయితే అయిందే ఈ మంచిపని! మేం అనేకం చేశాం వూళ్ళో - ఇలాగా?

కవి—మనం పోదామా...కళా!

కళ—ఆ! పోదాం పదండి.

కవి—వస్తానండీ...(ఇద్దరూ వెళ్తారు)

గోపా—ఇదేమిటి! ఈ కవిగారు ఆమెతో వెళ్తున్నాడు. ఏదోవుందే తికమక!

[రంగయ్య వంటిమీాద రక్తంతో వస్తాడు]

ఆనం—ఏమిటది రంగయ్యా! ఏం చేశావ్?

రంగ—పాడిచేశాను.

గోపా—ఎవర్ని!!

రంగ—ఆ వీరయ్యగాణ్ణి.

అందరూ—అరే!

గోపా—చచ్చాడా!!

రంగ——ఏమో! పొడిచాను. పారిపోయివచ్చాను.

రత్నం——(గబగబా ప్రవేశించి) ఎట్లావచ్చా విక్కడికి? వాళ్ళు తెగ వెతుకుతున్నారు. పో – దాక్కో (రంగయ్య పోయి Booking లో దాక్కుంటాడు.)

గోపా——నువ్వూ అక్కణ్ణుంచేనా ఏమిటి!

ఆనం——ఎట్లావుంది వీరయ్యకి!

ముకు——ఎక్కడ తగిలింది కత్తి!

రత్నం——భుజంమీద తగిలింది. హాస్పిటల్ కు తీసుకు వెళ్ళుతున్నారు. (లోపలికి చూసి) అదిగో వాళ్ళందరూ ఇక్కడికే వస్తున్నారు.

(లోపల్నించి కేకలు వినిపిస్తాయి "Station లో వుంటాడు వెతుకుదాం పదండి – రండి" అని – చాలామంది మాట్లాడినట్లు)

గోపా——కర్రలు తీసుకొస్తున్నారు. ఇప్పుడే చంపేట్లున్నారు.

ఆనం——రంగయ్యా – రంగయ్యా (గేటుదగ్గర కెళ్ళి) బయటికిరా.

రత్నం——రావద్దనండి! వాళ్ళు చంపేస్తారు.

గోపా——ఆనందం!

ఆనం——కాసీ చేసిన పనికి అనుభవింపక తప్పదు. రా, రంగయ్యా బయటికి.

రంగ——(బయటికి వస్తూ) అలాగే! చేసినదానికి అనుభవిస్తాను. అలాగే అనుభవిస్తాను. రానియ్యండి.

(లోపల—అడుగో రంగయ్య! తన్నండి వెధవని! పొడవండి గాడిదని! పదండి – రండి)

రంగ—రండి! నేనూ సిద్ధమే – (తను ఎదురు వెళ్తాడు)

[కొందఱు మనుష్యులు ప్రవేశించి]

మనుష్యులు—అడుగో...పట్టుకోండి,

(వెళ్ళి పట్టుకుంటారు; కొందరు కొట్టబోతారు)

—: తెర :—

— —

## ఏదవ రంగము

[అదే రంగం :- ఆనందం గోపాలం వున్నారు. ఉదయం 8 గం॥లకు]

ఆనం—నిన్న రంగయ్యని వదిలేశార్టండీ.

గోపా—ఆ! నువ్వే Bail యిప్పించావటగా.

ఆనం—ఆ, నేనే యిచ్చాను - హామీగాకూడా వుండాల్సి వచ్చింది.

గోపా—బాగుంది. నువ్వే అరెస్టు చేయించి నువ్వే Bail యిప్పించావ్.

ఆనం—వాడు తన తరఫున నన్ను సాక్ష్యం చెప్పమంటాడు.

గోపా—కోపిష్టి వెధవ! ఏదో సాయం చెయ్యి - పోనీ.

ఆనం—అదే ఆలోచిస్తున్నాను. ఏమని సాక్ష్యం చెప్పాలా అని. ఒళ్లు తెలియని కోపం వచ్చి పొడిచాడని చెప్పాలి. కాని వీరయ్య పెళ్ళాన్ని వీరయ్య కొడితే వీడికి కోపం రావటమేమిటి, వీరయ్య దగ్గరకెళ్ళి - వీణ్ణి వదిలెయ్యమని ఎట్లా అడగాలి? అని ఆలోచిస్తూన్నా...ఆ మర్చిపోయాను? నిన్న కమ్యూనిటీ ప్రాజెక్టు ఆఫీసర్ గారి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది, (ఉత్తరం తీసి యిస్తాడు)

గోపా—(ఉత్తరం చదువుతాడు) ఆనందరావుగార్కి, మీ బోటి విద్యావంతులైన, యువకులు గవర్నమెంటు ప్రోత్సాహం అభిలషించకుండానే, వంతెన కట్టడంలాంటి

ప్రయోజనకరమైన నిర్మాణ పనులలో నిమగ్నులు కావటం ఎంతగానో అభినందించవల్సిన విషయం "మీరు విశ్రాంతి సమయాల్లో రాళ్ళుకూడా, మీరే మోసి మీ బుద్ధిబలం; దేహబలంకూడా దేశ పునర్నిర్మాణానికి వినియోగిస్తున్నారు," అని తెలిసికొని చాలా సంతోషించాను.

అందరూ మీలాగ దేశ పునర్నిర్మాణానికి పూనుకుంటే దేశాభ్యుదయం కరతలామలక మవుతుంది. భగవంతుడు మీ కాయురారోగ్యాల ప్రసాదించుగాక.

ఇట్లు ఆఫీసర్.

కమ్యూనిటీ ప్రాజెక్టు.

(ఆనందం ఉత్తరం, గోపాలం చదువుతుంటే అది తనకి ఆట్టే పట్టనట్లు పక్కకి వెళ్ళి వంతెనవైపు చూస్తూ నుంచున్నాడు]

గోపా—(చదవటం అయిపోగా ఆనందం దగ్గరగా వెళ్ళి) బాగుంది.

ఆనం—(పరధ్యానంగా) బాగుంది. ఆ కాస్త పనీకూడా పూర్తిఅయితే వంతెన మరీ బాగుంటుంది కాదు ?

గోపా—వంతెన సంగతా ! వంతెనకేం ! ఫస్టుగా వుంది. రాత్రి కాంక్రీటుకూడా వేసినట్లున్నారే - లైట్లుపెట్టి.

ఆనం—ఆ ... వేశాం - ఇవ్వాళా రేపూ ఆరితే - ఇక పిట్ట గోడ మాత్రం మిగుల్తుంది. అదెంత లెండి ? కొంత రోజుల

పని – ఇక ఇరవై రెండు రోజుల తర్వాతగాని ఆ పోటీలు తియ్యటానికి వీల్లేదు. వచ్చే నెలలో Ope చేయవచ్చు.
గోపా—మొత్తానికి నీకు పూర్తి చేస్తేగాని నిద్రపట్టేట్టు లేదు.
ఆనం—పిట్టగోడ కట్టిన తర్వాత చూడాలి – దాని అందం.
గోపా—అది సరేగాని, D.T.S. దొరగారు దిగారట. ఏం చేస్తున్నారు ?
ఆనం—అదిగో ! Waiting Room లో వున్నారు.
గోపా—ఎందుకొచ్చారో తెలుసుకున్నావా ?
ఆనం—లేదు, ముకుందంగారికి, శ్రీధరంగార్కి, వెంకటే శ్వర్లుగార్కి రమ్మని కబురు చెయ్యమన్నారు. కబురు చేశాను. చాలాసేపయింది. వాళ్ళింకా రాలేదు.
గోపా—బలేవాడివే ! ఎందుకొచ్చారనుకున్నావ్ !
ఆనం—నేనేం అనుకోలేదు యింతవరకూ
గోపా—అదేమిటయ్యా ! పై ఆఫీసరొస్తే ఎందుకొచ్చాడో కనుక్కోక్క అక్కర్లే.
ఆనం—ఏమో ! ఎందుకో వచ్చాడనుకున్నా...
గోపా—ఎందుకో కాదు. వాళ్ళందరూ నీమీద రిపోర్టు చేశారు.
ఆనం—నామీదా ! ఏమని?
గోపా—ఏవేవో చాలా చెప్పారు.
ఆనం—అహా! (రంగయ్య నిమ్మదిగా ప్రవేశిస్తాడు)
గోపా—ఓ! రంగయ్యా?

రంగ—నేనే నయ్యా.

గోపా—ఆ నిన్న నే బయటకొచ్చావటగా.

రంగ—బాబుగారి దయవల్ల బయటపడ్డానండి. మీరు వీర య్యతో వకసారి మాట్లాడాలి బాబుగారూ – వీరయ్య – "నిన్న మావా డొకడితో అన్నాట్ట." "అంతమనసులేని దాంతో నేనేం కాపురం చేస్తానని" మీరు వక్కసారి మాట్లాడితే ఆడు వప్పుకుంటాడండీ.

ఆనం—ఏం వప్పుకుంటా డంటావ్?

రంగ—ఆడు వదిలెయ్యటాన్కి, దాన్ని నే మనువు చేసుకో టానికీ – కావాలంటే వాడు పెట్టిన డబ్బు వాడికిచ్చేస్తాను.

గోపా—ఏమిటీ! డబ్బిస్తావ్! నీదగ్గరక్కడిది!

రంగ—తంటాలుపడి ఓ వంద పోగుచేశాను. అదికూడా బియ్యంఅమ్మీ – పిడకలమ్మీ ఓ వంద పోగుచేసిందట.

ఆనం—అదీ – నువ్వూ పోగుచేశారా.

రంగ—అవును. యిందుకు డబ్బుపోగుచేస్తూందని తెలిసే, మొన్న అట్లా బాదాడు దాన్ని.

ఆనం—మాట్లాడతానులే.

రంగ—అల్లాగే బాబూ! మీరు తెల్చేసుంటే వసవృతుంది.

[శ్రీధరం, ముకుందం, వెంకటేశ్వర్లు షుంకా పసరిడ్డూ మనుష్యులూ వస్తారు]

గోపా—అరుగో అందరూ వచ్చారే!

రంగ—వస్తానండి బాబూ! [illegible] (వెళ్తాడు)

ఆనం—ఆ (అని రంగయ్యతో అని; గోపాలంతో) నే వెళ్ళి ఆఫీసర్ గారితో చెప్పొస్తా - వీరువచ్చారని. (Waiting Room వైపుకి వెళ్తాడు)

ముకు—ఏ ఆఫీసర్ గారండీ, D. T. S. గారేనా!!

గోపా—ఇది చూచారా మీరు, వుత్తరం వచ్చింది, ఆనం దానికి.

ముకుం—ఆనందంగారికా! (కాస్త చదివి) కమ్యూనిటీ ప్రాజెక్టు ఆఫీసర్ నుంచా - ఆ - (చదువుతాడు) "మీ బుద్ధిబలం దేహబలంకూడా వినియోగిస్తున్నారని తెలుసుకొని చాలా సంతోషించాను. (చదువు ఆపి) అవునుమరి. మేమందరం కూడా ధనబలంతో సహకరిస్తామని అంటే విన్నారా! పేరంతా తనకే రావాలనిగా! (చదువుతూ) "అందరూ మీలాగా దేశపునర్నిర్మాణానికి పూనుకుంటే దేశాభ్యుదయం కరతలామలక మవుతుంది".

శ్రీధర—దేశాభ్యుదయమనేగా-అంతా నేనేకట్టిస్తానన్నాను! నే నెక్కడ పైకివస్తానో 'అని' వద్దు పొమ్మన్నారు.

ముకుం—ఇదో నాటకమండీ! కాకపోతే చచ్చుపుల్లాయల్ని కూడగట్టుకు చేశాడుగానీ, మనల్నెవర్నన్నా దగ్గరకి రానిచ్చాడా? మనంవస్తే - వచ్చేపేరులో మనకీ భాగం వస్తుందని మనల్ని దూరంగా ఉంచాడు

శ్రీధ—అందుకనే నాదగ్గర తీసుకున్న రొండొందలూ తిప్పికొట్టాడు. మేం మాత్రం దేశాభ్యుదయానికి కాకపోతే-వందా - రెండొందలూ పూరికే యిస్తామూ!

ముకుం—నేను ఆమధ్య భూకంపానికి అయిదొందలు వసూలు చేయలే! దేశాభ్యుదయం కాదూ అని!

వెంక—అప్పుడు అయిదొందలూ వసూలు చేసింది? రెండొందలేగా నిధికి పంపింది!

ముకుం—కాదు - అయిదొందలే........

వెంక—దబాయించకు రెండొందలే! చెక్కు నేను కళ్ళారా చూశాను. అక్షరాలా రెండొందలు.

ముకు—తర్వాత మళ్ళీ మూడొందలు కట్టించలేదయ్యా - గొంతు వుందిగదా అని వూరికే అరుస్తావేం?

గోపా—కేక లెయ్యకండి. ఆఫీసర్ గారొస్తున్నారు.

ముకు—విడివిడిగా నుంచోండి. అందరం కలిసి వచ్చినట్టుగా కనిపించకూడదు.

వెంక—అందరం కల్సి ఎందుకొచ్చాం? ఎవరికివారే వచ్చాంగా!

శ్రీధర—ఆ వచ్చేది D. T. S. గారా! కమ్యూనిటీ ఆఫీసర్ గారా!

గోపా—కమ్యూనిటీ ఆఫీసర్ గారు (అని నవ్వుతాడు)

[ఆఫీసర్, ఆనందం వస్తారు]

శ్రీధర—నమస్కారమండీ! ఆనందంగారు ఈ వూళ్ళో వంతెన కట్టించారండీ. మే మందరం కట్టిద్దామనుకుంటుంటే అంతలోనే వారు కట్టించేశారండీ.

ముకు—ఆ, మాకు ముందుగా తెలిస్తే, అందరం కలిసి పెద్దదే కట్టించేవాళ్ళం.

వెంక—ఆ...ఆ...ఎటూపనికి రాకుండా పోయింది. ఇప్పుడు రెండెడ్లబండీ వెళ్తూంటే - ఎదురు రావటానికి యిరుకు.

శ్రీధర—మేం తొందరగానే ఊళ్ళో గ్రంథాలయం ఒకటి పెరుద్దామనుకుంటున్నాం. దానికి మీరు సాయంకాలం శంఖుస్థాపన చేస్తే బాగుంటుందని.

వెంక—గ్రంథాలయం వకటి వుందిగా.

శ్రీధర—ఇంకోటి లేవయ్యా! నీకు తెలీదు.

ముకు—అసలు మీరు రెండు రోజులు ఈ వూళ్ళో Camp వేసుకుంటే బాగుంటుందండి. మా ఇంట్లో అన్ని సదుపాయలూ వున్నాయి. ఊళ్ళో వుంటే మీకు అన్ని సంగతులూ తెలుస్తాయి.

ఆఫీ—ఈ గోలంతా నాకెందుకండి! అసలు సంగతి చెప్పండి.

(గోపాలం అవతలకెళ్ళి పోతాడు ముసిముసి నవ్వులతో)

శ్రీధర—ఇంకా అసలు సంగతేమిటండీ!

ముకు—మీరేదన్నా కొత్తపనులు ఊళ్లో చెయ్యదల్చుకుంటే తప్పకుండా సహాకరిస్తామండి. ఏమండీ వెంకటేశ్వర్లు గారూ!

వెంక—ఎందుకు సహాకరించమండి! అల్లాగే!

ఆఫీ—ఏమిటండీ ఇదీ! మీ రందరూ ఆనందంగారి మీద రిపోర్టు చేశారే అది విచారించటానిక్కి వచ్చాను.

ముకు—ఆనందంగారిమీద రిపోర్టా! మీకా! మీకు రిపోర్టు చేశామా!

ఆఫీ—ఆ! నాకాకపోతే మరెవరికి? ఇవిగో రిపోర్టులు.

ముకు—మీరు D. T. S. గారా!

వెంక—ఈ గోపాలంగారేరీ!

శ్రీధర—మేం అల్లా అనుకోలేదే!

ఆఫీ—ఆ...మీలో ముకుందం గారంటే ఎవరు?

ముకు—నే నండీ!

ఆఫీ—మీరు ఆనందంగార్ని గురించి ఏమని రిపోర్టు చేశారు?

ముకు—చిత్తం. ఆనందంగారు వచ్చిన దగ్గర్నించీ బొత్తిగా స్టేషన్ బాగుండటంలేదు. ఆఫీసుపన్లు పట్టించుకోకుండా ఎప్పుడూ ఆ వంతెన వ్యవహారాలే చూస్తుంటారు. అంతే కాక ఊళ్లో రాజకీయాల్లో కల్పించుకుని, పార్టీలు లేవ గొట్టుతున్నారండి. పైగా మేమేదన్నా వ్యవహారంలో స్టేషన్కి వస్తే చిన్నా పెద్దా చూడకుండా, ఎంతమాట పడితే అంతమాట అంటారండి.

శ్రీధర—ఆమాట ఒక్కటీ నిజమండి. నన్ను ఏమన్నాడను కున్నారూ?

ఆఫీ—తర్వాత చెపుదురుగానీ-వారిని ముందు చెప్పనివ్వండి. ఇంతేనా మీరు రిపోర్టు చేశింది?

ముకు—ఇంకా - రైల్వే పార్సిల్ తీసుకోవటంలో - బాండ్లో లంచాలు తీసుకుంటారండీ...

ఆఫీ—మీదగ్గరెప్పుడన్నా తీసుకున్నారా?

ముకు—ఇదిగారండి.

ఆఫీ—ఎప్పుడూ ?

ముకు—వెంకటేశ్వర్లు పసుపుబస్తా రవాణా చెయ్యటానికి వస్తే అడిగారండి. అప్పుడు నేను వెంట వున్నానండి. వారు రు 50 లు యివ్వటం నేను చూశానండి. ఆయనే నండి వెంకటేశ్వర్లుగారంటే.

ఆఫీ—ఇది మీ రిపోర్టులో రాయలేదే?

ముకు—వారి రిపోర్టులో వుందికదా అని.

ఆఫీ—అహా. మీరిద్దరూ కూడబలుక్కునే పెట్టారా ఈ రిపోర్టు?

ముకు—(నాలిక కొరుక్కుంటాడు).

ఆఫీ—ఆ, తర్వాత శ్రీధరం గారెవరూ ?

శ్రీధ—నేనేనండి ! మావాడు మీకు తెలిసేవుంటాడండీ

ఆఫీ—మీ వాడెవరు ?

శ్రీధ—వాడేనండీ ! శంకర్రావు ! మిమ్మల్ని - మీ వాళ్ళనీ, బాగా ఎరుగున్నాడండీ.

ఆఫీ—శంకర్రావనే వాడెవడ్నీ నే నెరగనే!

శ్రీధ—అబ్బే ! మీకు తెలుసునండీ. మీదగ్గరికి చాలాసార్లు వచ్చాడు.

ఆఫీ—ఏ వ్యవహారంలో ?

శ్రీధ—వాడికి చాలా వ్యవహారా లున్నాయిలెండి - ఎత్తు ర్రాపింగూ - వాడూ.

ఆఫీ—ఆగండి. అటువంటి వాడెవడూ నా దగ్గర కెప్పుడూ రా లేదు.

శ్రీధర—అయితే - ఎరగరూ ? పల్లెత్తుగా వుటూరుకి !
ఆఫీ—ఎరగను.
శ్రీధర—బాగా ఎరుగునని చెప్పాడే!...అయితే...!
ఆఫీ—ఆ...ఆ...మీ రేదో రిపోర్టు చేశారు.
శ్రీధర—ఆ...ఆ...చేశానండి. టిక్కెట్లు సరిగా వేళకివ్వటం లేదండీ. వంతెన కోసమనీ - అదనీ - యిదనీ - చందా మామూళ్లూ, అడుగుతారండీ...
ఆఫీ—మీ రెప్పుడన్నా మామూళ్లు యిచ్చారా.
శ్రీధ—ఇచ్చానండీ! వందరూపాయలు.
ఆఫీ—దేనికిచ్చారు?
శ్రీధర—నాకు రవాణా పనుండి ఇచ్చాను.
ఆఫీ—రవాణా పనుంటే - మామూలు అడిగారా ? మామూలివ్వకపోతే చెయ్యనన్నారా ?
శ్రీధర—అనలేదండి - నేనే యిస్తే తీసుకున్నారు.
ఆఫీ—మీరు మామూలిస్తే వారు తీసుకున్నారన్నమాట వద్దనకుండా? వారు తీసుకోవటం ఎంత తప్పో మీరివ్వటం అంత తప్పే.
శ్రీధ—అంటే నేను వీరికివ్వలేదండీ...
ఆఫీ—ఆ...ఆ...వీరిక్కాదూ! మరెవరి కిచ్చారు ?
శ్రీధర—ఆ...అదే...
ఆఫీ—మరి వీరికే యిచ్చానని వ్రాశారు.
శ్రీధర—ఆ...అదే...వీరికంటే వీరి బాపతు ఒక అమ్మాయి కండి.

ఆఫీ—అమ్మాయా! అమ్మాయి ఎవరు?

ముకు—అదేలెండి; వీరికి సంబంధించిన ఒకమ్మాయికి.

ఆఫీ—అంటే -!

వెంక—వీ రుంచుకున్న అమ్మాయి.

ఆఫీ—అహా!

ముకు—ఆమె ఇక్కడే వుంటుందిలెండి - ఎప్పుడూ.

వెంక—ఆ వ్యవహారం చాలా వుందిలెండి. వీరెప్పుడూ ఆమెతో మాట్లాడుతుంటారు.

ఆఫీ—ఆగండి. (శ్రీధరంతో) మీరు చెప్పండి. మీరు ఆమెకు డబ్బు ఇచ్చారా?

శ్రీధర—అహా! చందా వేయమంటే వేశాను.

ఆఫీ—అందువల్ల మీ కేం లాభం జరిగిందీ? చందా వేసినందు వల్లే Wagon వచ్చిందంటారా?

శ్రీధర—చందా వెయ్యకపోయినా - అదివర కొకసారి యిచ్చారు. గానీయండి - అది చాలా చిన్న వేగనండీ. ఈ తడవ సరుకు కొద్ది - అయినా పెద్ద Wagon యిచ్చారండి.

ఆఫీ—ఊ! సరే - ఇంకా.

శ్రీధర—ఇంకేం - లేవండి.

ఆఫీ—సరే! వెంకటేశ్వర్లుగారెవరూ?

వెంక—నేనండీ.

ఆఫీ—మీరు లంచం ఇచ్చానని చెప్పారుగా?

వెంక—ఆ...ఆ...ఇచ్చానండీ.

ఆఫీ—మీరు వ్రాసిందాట్లో అదిలేదే? దొంగలతో స్నేహమనీ, నడవడిక మంచిది కాదనీ – ఏవో వ్రాశారు.

వెంక.—అవ్వన్నీ నిజమండి. ఆ అమ్మాయి ఎవరో ఎప్పుడూ Booking లోనే వుంటుందండి.

ఆఫీ—అంటే – వీరు Duty లో ఉన్నప్పుడా?

వెంక—ఆ...అదే – ఇద్దరూ మాట్లాడుతూ కూర్చుని వేళకి టిక్కెట్లు ఇవ్వరండి.

ఆఫీ—అల్లా టిక్కెట్టు ఇవ్వనందువల్ల మీకెప్పుడన్నా రైలు తప్పిందా.

వెంక—నేను వెళ్ళవల్సిన అవుసరం రాలేదుగాని, వస్తే తప్పేదేనండీ. వీళ్లు ఎప్పుడూ ఇక్కడే వుండటం చూడలేక అసలు రైలుకి రావటమే మానుకున్నాంలెండి.

ఆఫీ—ఇంకా?

వెంక—అంతేనండీ! ఈ దుష్ప్రవర్తన చూడలేకే యీ అర్జీ దాఖలు చేసుకున్నామండీ.

ఆఫీ—సరే. Mr. ఆనందరావ్! నీమీద ఊళ్ళో పెద్దమనుష్యులు ఈ క్రింది అభియోగాలు చేశారు. పార్సెల్ Book చేసుకోవటంలో, లంచాలూ మామూళ్ళూ పుచ్చుకుంటున్నావనీ, అఫీషియల్ టైం ప్రకారం Duty చెయ్యటం లేదనీ నీకనవసరమైన Public affairs లో పాల్గొంటున్నావనీ, Booking లోకి ఇతరులను రానిస్తున్నావనీ...

వెంక—అందులో ఆడవాళ్ళని. . .

ఆఫీ—ఎవరైనా మాకనవసరం. ఇవి నీమీద అభియోగాలు. వీటికి నువ్వేం సంజాయిషీ చెప్తావ్?

ఆనం—అన్నీ అబద్ధాలంటాను.

ఆఫీ—అంటావని తెలుసుకాని అబద్ధాలని ఋజువుచేసుకోవాలి.

ఆనం—ఋజువుచేసుకోటానికి ప్రయత్నిస్తాను.

ఆఫీ—అట్లాగే రెండుగంటలు వ్యవధి ఇస్తాను. ఈలోపున ఎవర్నన్నా సాక్ష్యానికి పిలిపిస్తే పిలిపించుకో.

[కవి, ఆయనవెనకనే గోపాలం వస్తారు]

కవి—(ముకుందం మొదలయినవారితో) మీరిక్కడేవున్నారు గదా! ఇక్కడికొచ్చారని తెలిసి మళ్ళీ వెళ్ళిపోతారని గబగబా వంతెనమీదినించి నడిచొచ్చేశాను.

ఆనం—వంతెన మీదనుంచా (ఖంగారుగా అంటాడు)

కవి—ఆ, వంతెనమీదనుంచే-ఆ వంతెన ఇంకా ఆరలేదే?

ఆనం—రాత్రేగా వేశింది. అప్పుడే నడిస్తే పాడైపోదూ?

కవి—పాడయిపోతుందా! నాకేం తెల్సు! అయినా ఎవరూ నడవకూడదని వకబోర్డన్నా కట్టలేదే?

ఆనం—బోర్డుకట్టకపోతేమాత్రం ఆమాత్రం తెలియదటయ్యా!

కవి—ఏమో! అందరూ నడుస్తూనే వున్నారు. నే చూస్తుం డగా చాలామంది నడిచారు.

ఆనం—ఆ!!

శ్రీధర—నిజానికి మేమూ దానిమీదే నడిచివచ్చాం. ముకుందంగారు బాగా వున్నారో లేదో చూద్దామని యిట్లా వూగారుకూడా.

ముకుం—అబద్ధాలు చెప్పకు. ఎంక్వాయిరీ అయిపోయిందిగదా అని.

ఆనం—క్షమించండి (ఆఫీసర్‌తో) ఒక్క-సారి - ఒక్క-సారి వెళ్ళి చూసివస్తాను. (వెళ్తాడు.)

గోపా—అయినా అంత తొందరేంవచ్చింది? కొంపంతా మునిగిపోయినట్టు వచ్చావ్.

కవి—ఇదిగో, ఈ Photo ఇద్దాంగదా అని. ఇదిగోనండీ మీరడిగిన ఫొటో.

గోపా—ఏం Photo!

కవి—అదే! మోహన్ కళా కలిసి తీయించుకున్నది.

వెంక—ఏదీ! ఏదీ!

ముకుం—ఆగండి. తొందరపడితే ఎట్లా! దీనిసంగతి తర్వాత తేల్చుకుందాం?

వెంక—ఇస్తానన్నది ఎగెయ్యనులే. ఆమాత్రం నమ్మకం లేదూ?

ముకుం—వ్యవహారంలో ఎవర్నీ నమ్మకూడదులెండి.

గోపా.—ఈ Photo నువ్వెందుకు తెచ్చావసలు? కళకు చెప్పావా?

కవి—చెప్పలే! కళకు తెలియకుండా తెమ్మన్నారుగా.

గోపా—అరే!!

కవి—ఏం! అట్లా అన్నారేం!

గోపా—దానిసంగతి బోలెడుంది.

కవి—ఏమో! నాకేం తెల్సు! రోజూ కళ దీన్ని చూశి ఏడుస్తుంది. అది నే చూశి భరించలేకపోయాను. కలకంఠి నట్టింట కన్నీరొలకించటం ఏ కవి చూశి భరించగలడు. కనక.........

గోపా—ఏడిచినట్టుంది.

వెంక—ఇక మేమందరం వెళ్ళొచ్చునా. ఆయన సంజాయిషీ అయ్యేదాకా వుండాలా?

ఆఫీ—వెళ్ళవచ్చు.

వెంక—రండి! ముకుందంగారూ, త్వరగా...

ముకుం—పదండి. కాని అంత తొందరలేదులెండి.

కవి—మరి ముకుందంగారూ! నన్నూ ఇంటికి రమ్మంటారా?

ముకుం—ఆ...ఒక గంటాగిరండి – ఈలోపుగా వెంకటేశ్వర్లు గారితో కూడా మాట్లాడతాను. (అంటూ అందరూ వెళతారు).

[గోపాలం, ఆఫీసరు వుంటారు]

ఆఫీ—ఏమిటండీ యిదంతా?

గోపా—చిత్రం! నాకూ బాగా తెలియదు. కానీ దీనికంతకీ ఆనందంమీద ఇతరకోపాలే అసలుకారణం.

ఆఫీ—అయితే, ఆనంధరావు తప్పేలేదంటారా?

గోపా—అతను ముక్కుసూటిగా నడవటమే అతనితప్పు.

ఆఫీ—అంటే అతను లంచాలూ, మామూళ్ళూ తీసుకో లేదంటారా? ఆ అమ్మాయి ఎవరూ? ఆమెతో తిరగట మేమిటి? నేనిక్కడుండగా వంతెన ఎవరో తొక్కారని అలా పరుగెత్తాడేమిటి? ఈ Enquiry కంటే అదే ముఖ్యమా? ఆఫీసరన్నా వుద్యోగమన్నా, అంతలక్ష్య మన్నమాట! ఇది వక్కటే చాలు. అతని వళ్ళు పొగ రెంతుందో తెల్సుకోటానికి.

గోపా—చిత్రం, ఏదో కుర్రతనం. ఇదే కొత్త......

[కళ, రత్నం వస్తారు తొందరగా]

రత్నం—కవిగారేరండీ – కవిగారేరీ?

గోపా—ఏమిటది? ఏం.

రత్నం—పెట్టెలో Photo తీసుకొచ్చారు – చెప్పకుండా – పెట్టకుండా. అవ్వీ ఆ వుత్తరాలుగూడా!

గోపా—అవి కొట్టెయ్యటానికి ఈయన్ని వాళ్ళు కలుపు కున్నారా ఏం?

కళ—ఈయన్ని కలుపుకున్నారా?

రత్నం—ఆ! కలుపుకున్నట్టే వున్నారు!

గోపా—(వంతెన వైపు చూసి) అదిగో అక్కడే ఉన్నా రందరూ. ఏదో ఘర్షణ జరుగుతున్నట్టుందేం?

కళ—ఏదో జరుగుతోంది – మీరూ రండి కాస్త.

గోపా—నేనూ రానా! – ఎల్లా! ఇక్కడా...(అని ఆఫీ సర్ వంక చూస్తాడు.)

ఆఫీ—వెళ్ళిరండి.

గోపా—రత్నం! వెళ్ళి రంగయ్యని కేకేసుకురా పో.

(కళా, గోపాలం గేటువైపు, రత్నం Platform వైపూ వెళ్తారు. ఆఫీసర్ - రత్నంతో)

ఆఫీ—ఏయ్! నువ్విట్లారా.

రత్నం—(ఆగి) నాకిక్కడకంటె, అక్కడే పనుందండీ!

ఆఫీ—ఏం?

రత్నం—అందరూ కలిసి ఆనందంగారితో పోట్లాడుతున్నారు.

ఆఫీ—పోట్లాడితే నీకేం?

రత్నం—పోట్లాట మించిపోకుండా చూడాలి.

ఆఫీ—పోట్లాటలో నువ్వూ కలుస్తావా?

రత్నం—కావాల్సొస్తే చెయ్యీ చేసుకుంటా!

ఆఫీ—ఆనందంగారి తరఫునా!

రత్నం—అవును.

ఆఫీ—ఆయన అంత మంచివాడా!

రత్నం—దేముడు.

ఆఫీ—అయితే మాత్రం! అందరూ కల్సి నిన్నూ తంతే దేముడు అడ్డురాడుగా?

రత్నం—ఆయనమీద చెయ్యి పడకుండా వుంటే చాలు, ఈ ప్రాణాలు పోయినాసరే.

ఆఫీ—ఊఁ! నేనెవర్నో తెలుసా?

రత్నం—తెలియదు.

ఆఫీ—అందుకే అట్లా మాట్లాడావ్ D.T.S. అంటే తెలుసా?

రత్నం—మీరా!

ఆఫీ—ఆ! ఈయనమీద రిపోర్టులు చేశారు వాళ్ళంతా. Enquiry చేయటానికి వచ్చాను.

రత్నం—ఆయనమీద రిపోర్టు చేశారా! దొంగగాడిదలు!

ఆఫీ—నోటికి వచ్చినట్లు అల్లా మాట్లాడకు. వాళ్ళంతా పెద్ద మనుష్యులు. ఊఁ! ఈ అమ్మాయికీ ఆనందరావుకీ స్నేహమటగా?

రత్నం—అవును.

ఆఫీ—ఆ అమ్మాయి చెడిపోయిందట ?

రత్నం—ఎవరన్నారు ?

ఆఫీ—నాకంతా తెల్సులే - ఊఁ! పోయి ఆ అమ్మాయిని నా దగ్గర కొకసారి రమ్మను. Waiting Room లోనే వుంటాను తెల్సిందా.

రత్నం—ఏమిటి - తెల్సిందా అంటారు ?

ఆఫీ—ఆ అమ్మాయి వస్తే ఆనందం వుద్యోగం నిలుస్తుంది. తెల్సిందా - పో. (అంటూ తను Waiting Room లోకి వెళ్తాడు)

దొంగ—హు. పెద్దమనుష్యులు!

[ఆనందం, కళ, గోపాలం, రంగయ్య వస్తారు]

రంగ—పెద్ద మనుషులనే వూరుకున్నాను; లేకపోతే కాలవలో కుక్కేవాణ్ణి.

గోపా—ఇక వూరుకో - అవతల దొరగారున్నారు.

దొంగ—ఆ దొరగారు; దొరతనం బయటపడిందిలెండి.

గోపా—ఏమంటావ్!

దొంగ—దొరగారి దొరతనం బయట పడింది. అమ్మాయి గార్ని ఎందుకో పంపించాలట తన దగ్గరకి!

గోపా— } అమ్మాయినా!
ఆనం— } కళనా!

దొంగ—ఆ - పంపకపోతే ఆనందంగారి వుద్యోగమే వూడ పీకేస్తారట.

ఆనం—నా వుద్యోగమా?

దొంగ—పెద్దపెద్ద వాళ్ళకే రోగాలు పుడ్తున్నాయి.

ఆనం—ఛీ...ఛీ...గోపాలంగారూ; ఈ వుద్యోగం నాకక్కర లేదు; రాజీనామా యిచ్చేస్తాను.

గోపా—ఆ!

ఆనం—ఇంత నీచం చూస్తూ బ్రతికే దానికంటే చావటమే నయం (స్టేషన్ బయటనించి ఏదో గోల విన్పిస్తుంది. అందరూ అదిరిపడి అటు చూస్తారు)

గోపా—ఏమిటది?

దొంగ—వంతెన దగ్గర జనం చేరారేమిటి?

గోపా—ముకుందం వాళ్ళే!!...ఎందుకక్కడ చేరారూ?

దొంగ—వంతెన పడగొడుతున్నారు. రంగయ్యా! పద సంగతేమిటో కనుక్కుందాం?

ఆనం—(కశి పట్టలేకపోతాడు) ఏం ప్రపంచం?... వెధవ ప్రపంచం!...

గో—మన ప్రపంచమే?

[ఆఫీసర్ గోల విని తొందరగావస్తూ]

ఆఫీ—ఏమిటీ గోల.

గోపా—వంతెన పడగొడుతున్నారు.

ఆఫీ—ఏం? ఏమొచ్చింది?

గోపా—మానవుడిలో దానవత్వం అలాగే రేకెత్తుతుంటుంది అప్పుడప్పుడూ; కష్టపడి కట్టటానికి ఒక్కడికి చేతులు రావు. పడగొట్టటానికి పెద్దమనుష్యులంతా పూనుకున్నారు.

ఆఫీ—శుభ్రమైన వంతెన పడగొట్టటానికి బుద్ధెలాపుట్టిందీ.

గోపా—శుభ్రమైన బుర్రల్లోనే పాడు బుద్ధులు పుడతాయి.

ఆఫీ—అరే!!

గోపా—ఆశ్చర్యంగా వుందాండీ! మిమ్మల్ని చూస్తే మాకూ ఆశ్చర్యంగానే వుంది!

ఆఫీ—అదేమిటి!

గోపా—ఆ అమ్మాయిని రమ్మన్నారటగా!

ఆఫీ—అవును. రమ్మన్నాను.

గోపా—ఎందుకూ?

ఆఫీ—ఈ అమ్మాయి శ్యామలరావుగారి పెద్దకుమార్తెగారూ!

కళ—ఆ. (ఆఫీసర్ పలకక తెల్లబోయి చూస్తుంటే)

ఆసీ—పేరు కళగాదూ ?

కళ—ఆ.

ఆసీ—తల్లిదండ్రుల మాట వినకుండా వాళ్ళందర్నీ వదిలేసి ఏ పాడుగుడిశెలోనో అయిదేళ్ళబట్టీ అజ్ఞాతవాసం చేసింది కాదూ

కళ—మీా కెట్లా తెలుసు ?

ఆసీ—నాకంతా తెల్సు. నువ్వెంత పాపం చేసినా మీా తల్లి తండ్రులు క్షమించలేని పాపమేమీా చేయలేదమ్మా ! ఎంత వెతికినా నువ్వు దొరక్క మీా అమ్మా, నాన్నా మంచాన పడివున్నారు. ఇంటికి రా అమ్మా...

గోపా—మిమ్మల్ని చాలా తప్పుగా అర్థం చేసుకున్నాం—మేమంతా క్షమించండి.

ఆసీ—ఈ సంగతి మాట్లాడదామనే రమ్మన్నాను, అమ్మాయీా — కావాలంటే ఈ ఆనందాన్నే పెళ్ళాడుదువుగాని; అంతమాత్రానికి తల్లిదండ్రుల్ని వదిలెయ్యాలా! నే చెప్తా మీా నాన్నగారితో. ఇంటికిరా.

కళ—నన్ను క్షమించండి. నా చరిత్ర మీాకు తెలియదు.

ఆసీ—ఏ చరిత్రయినా కన్నకడుపు! అంత కఠినత్వం వహించదులే.

[ముకుందం. శ్రీధరం, వెంకటేశ్వర్లు, మరికొందరు వస్తారు]

ఆసీ—ఏం ఇట్లావచ్చారు ?

వెంక—అంతు తేల్చుకోటానికేలెండి.

ముకుం—ఆఫీసర్‌గా మీరు చేసేదేదో చెయ్యండి, ప్రా
పెద్దమనుష్యులుగా తతిమ్మాపని మేము చేస్తాం.

గోపా—అంటే అర్థం?

వెంక—అంటే చేస్తున్న అప్రతిష్ట పన్లకి చేత్తో బుద్ధిచెప్తా

ఆఫీ—ఆనందానికా?

మోహ—ఆనందాన్కి - అడ్డొచ్చినవాళ్ళకీగూడా.

గోపా—అప్రతిష్టపనులెవరు చేశారు?

వెంక—మీరూ, మీఆనందం; అతని వెనక ఆ గాంగ వెధవ;
రౌడీవెధవ.

శ్రీధర—చూడండి ఆ వెధవల్ని చావబాది అవతల పడేశాం.

ముకుం—ఆ వంతెనపని అయింది.

గోపా—పాడుచేశారా - అంతా!

ముకుం—పూర్తిచేశాం.

ఆఫీ—వీళ్ళంత అప్రతిష్ట పనులేం చేశారు?

వెంక—ఏంచెయ్యాలి; సంసారుల సీతిని నాశిపాలు చేశారు.

గోపా—ఎవరిని?

వెంక—ఇదిగో మా అబ్బాయిని ప్రేమించిన అమ్మాయిని
పాడుచేశారు. చూడండి ఆఫీసర్‌గారూ, ఈ Photo
చూడండి (Photo ఇస్తాడు)

ఆఫీ—ఈమె మీ అబ్బాయిని ప్రేమించిందా?

ముకు—ఆ, ఈ అమ్మాయి మతిచెరిచి సల్లురిలో నవ్వపాలు
చేస్తున్నారు.

శ్రీధ—పరాయిపిల్లతో ప్లాటుఫారంమీద, పరాచకలాడు తున్నారు.

గోపా—అయితే మీరందరూ ఈ అమ్మాయినీతీ, జాతీ నిల బెట్టటానికొచ్చారా ?

వెంక—అవినీతికి బుద్ధి చెప్పటానికు క్కూడా ?

ముకు—రౌడీ వెధవల రోగం కుదర్చటానిక్కూడా !

ఆఫీ—ఆగండి, ఇది Platform; మేముద్యోగులం: Dutyలో వున్నాం. Duty లో వున్న ఎవరిమీద చెయ్యిచేసుకున్నా న్యూరికేపోదు.

ముకు—మీరుకూడా వాళ్ళనే వెనకేసుకొస్తున్నారా ?

ఆనం—ఆ. వెంటనే Platform ఖాళీ చెయ్యకపోతే, పోలీసులొచ్చి పంపిస్తారు.

[దొంగ, రంగయ్య, ప్రవేశం]

దొంగ—అక్కర్లేదే! మేమే వస్తాం; చెడ్డతనానికి సాయం దొరికితే, మంచితనానికి దొరక్కపోదు.

వెంక—అహా! రావయ్యా - ఇప్పుడు కాకపోతే మరొక్క ప్పుడు చిక్కరూ ?

ముకు—దొంగలూ దొంగలూ కలిస్తే మనం ఏం చేస్తాం పద.

శ్రీధర—Platform వదిలి రానీలే; పని పడదాం.

ముకు—అందరి నెత్తినా మొట్టగల్గిన అధికారి వకడున్నాడు. మర్చిపోకండి.

గోపా—ఉన్నాడు దేముడు; జ్ఞాపకం వుంచుకోండి.

**ముకుం—ఉన్నాడు, - వస్తాడు సాయం; చుట్టూ రౌడీలు, గూండాలు, లేకపోతే తెల్సేది.**

వెంక—పదండయ్యా సమయం రాకపోతుందా? చేతికి జుట్టు చిక్కకపోతుందా?

శ్రీధర—పదండి. అప్పుడు తెలుస్తుంది పస.

వెంక—ఆఫీసరుగారి ఆసరాచూసుకుని ఆటాడుతున్నారు. ఆట కట్టిస్తా చూస్తూండండి.

అందరు—రండి. (అందరూ వెనక్కి తిరిగి పోబోతుండగా మోహన్ ఎదరవస్తాడు; అందరూ ఆగారు)

వెంక—నువ్వెందుకురా వచ్చావ్.

మోహ—నీకోసమే!

వెంక—నాకోసమా.

మోహ—ఆ. నీతో మాట్లాడాలనే.

వెంక—మాట్లాడదాం రా. నే నింటికొస్తున్నా.

మోహ—కాని నేనింటికి రావటంలేదు.

వెంక—ఏం?

మోహ—ఏంకాదు (కళవంక తిరిగి) కళా! నన్ను క్షమించు. పిరికివాణ్ణయి ధైర్యం చేయలేకపోయాను.

కళ—మోహన్!

వెంక—ఏమిట్రా యిది?

మోహ—ఏంలే, ఇక నువ్వు వెళ్ళు.

వెంక—అయితే దీన్ని పెళ్ళిచేసుకుంటావా?

మోహ—పెళ్ళి యిదివరకే అయితే?

వెంక—అయితే ఇంకేం? కానియ్యి, నాదగ్గిర్నించి ఇకదమ్మిడీ జ్ఞాపకముంచుకో.

మోహ—పోన్లే. నాకురాకపోతే - నీ మనుమలకొస్తుంది.

వెంక—ఆ.

మోహ—నేను ప్లీడర్లని కనుక్కున్నా నాన్నా! మరేం ఫర్వా లేదన్నారు. ఇక నువ్వు వెళ్ళు.

వెంక—కానీ చూద్దాం. పదండి. ఆట ఎంతవరకూ సాగుతుందో చూద్దాం (అందరు వెళ్తారు)

ఆఫీ—ఏమిటిదంతా?

గోపా—అదే లోకరీతి.

ఆఫీ—హాః, ఏమైనా ఎంక్వయిరీ యింతటితో పూర్తయింది, నువ్వు నాతో రా అమ్మా; మీనాన్నావాళ్ళు నిన్నేం నిందించరు. తర్వాత సంగతులన్నీ తేలుద్దాం; ఆ-ఆనంద గాన్ ఏడీ, అతన్ని వెంటనే Transfer చేయిస్తా.

గోపా—ఏడీ.

వెంగ—అదిగో వంతెనదగ్గర.

గోపా—పాడయినదాన్ని బాగుచేస్తున్నాడు.

ఆఫీ—ఇంకా ఎందుకొచ్చిన వంతెన - కావల్సినవాళ్ళే కూలదోసిపోతే?

గోపా—కూలదన్నారు, కట్టినవాళ్ళ బాధ గ్రహించలేక. సొంతంగా రాళ్ళుదీసి, సొంతంగా రాళ్లుమోసి కట్టాడు పాపం. సొంతానికి కాకపోయినా!

ఆఫీ—నాకదే అర్థం కావడంలేదు. మనిషిమీద కోపంతో మనసును మర్చిపోతారేం.

గోపా—మానవత్వాన్నే మరచిపోతారు.

దొంగ—అదిగో మాష్టరుగారు కాంక్రీటు కలిపి మోసుకు వెళ్తున్నారు.

కళ—పాడైందాన్ని బాగుచెయ్యాలనే కాబోలు రావయ్యా! మనం సాయం చేద్దాంరా.

గోపా—ఎంత పట్టుదలో! ఇంత గోల జరిగింది పట్టలేదు; పాడయిందాన్ని బాగుచేస్తున్నాడు.

ఆఫీ—నాకిప్పు డర్థమవుతోంది – ఆనందం అంటే ఏమిటో! స్వార్థరహితంగా సేవ ,చెయ్యటమే ఆనందం. దేశంలో అందరూ ఆనందరావులైతే, దేశదరిద్రం తొలగిపోతుంది. పదండి గోపాలంగారూ, నా భుజం దురద పుడుతోంది. మనం సాయం చేదాం పదండి.

(ఇద్దరూ వంతెనవైపుకి వెళ్ళతారు)



:— తెర :—

